# నరసప్పభట్టు

చారిత్రిక సాంఘిక రూపకము


రచయిత

వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావు

Vinjamuri Venkata Lakshmi Narasimha Rao

# నరసన్న భట్టు

చారిత్రిక సాంఘిక రూపకము


రచయిత

వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావు


నాంది ప్రస్తావనల రచయిత :

శ్రీ అనంత పంతుల రామలింగస్వామి


ప్రకాశకులు :

అనసూయా పబ్లికేషన్స్, మద్రాసు 17.

Anusuya Publications.


వెల రు 2 లు

*Dedicated*

to

Sri T. V. Raghaviah, A.F.I.I.

Zamindar of Ampapuram,

Chinalingala etc. Estates.

by

Sri V. V. L. Narasimha Rao

Pandit & Poet - Madras 17.



**Mr T V Raghaviah, A.F.I.I.**

(Zamindar, Annapuram, Chinalingada etc Estates)

Assistant Secretary, Development

Life Insurance Corporation of India,

Southern Zone, Madras

# మున్నుడి

పిఠాపుర సంస్థానాధీశ్వరులగు శ్రీ రావు గంగాధర రామారావుగారి అంతరంగిక కార్యదర్శిగా మా తండ్రిగారు, బ్రహ్మశ్రీ లక్ష్మణమూర్తిగారు చాలకాలముండిరి. ఆదినాలలో సంస్థానోద్యోగులలో ఆంగ్లభాష తెలిసినవారు మా నాన్నగారొక్కరే. ఆయన, గంగాధర రామారావుగారి కోరికపై "The History of Rao Family and Vinjamuri Family" అను పేరున మా యుభయ వంశాలమధ్యగల చిరకాలమైత్రిని దెలుపుచు, ఆంగ్లమున నొక గ్రంథము రచించి, సుమారు 80 యేండ్ల క్రిందనే అచ్చువేయించిరి. అందే నరసన్నభట్టు గాథ సంపూర్ణముగ నున్నది. దానిని కథావస్తువుగాఁ గైకొని, కొన్ని కల్పనలు చేసి, నే నీ రూపకమును రచించితిని.

నా మామగారు బ్రహ్మశ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారప్పుడు తత్సంస్థాన కవీంద్రులుగా నుండి, "రావువంశముక్తావళి" అను గ్రంథమును ఆంధ్రమున రచించిరి. అందుగూడ ఈ గాథ కొంతవఱకుఁ గలదు. ఆ గ్రంథముకూడ నాకు మిగుల సహకారమొనర్చినది.

ఈ నాటకమందలి యితివృత్తము చారిత్రాత్మకమే; క్రీ॥శ॥ 14వ శతాబ్దానంతరము జరిగినకథయని తోఁచుచున్నది. మాధవస్వామి ఆకాలము నాఁటిదగుట. అయినను రసపుష్టి కొఱకు కొన్ని కల్పనలు చేసితిని. నరసన్నభట్టును వెలివేయుట జరిగినదో లేదో నాకుఁ దెలియదు. అది ఛాందసయుగము కదా. శూద్రస్త్రీ చేతి యన్నమును దిన్న నరసన్న నాదినాలలో సంఘమునుండి బహిష్కరింపక యుందురా, అతఁడు మహాపండితుఁడు గనుకఁ దానొనర్చిన పని తప్పుగాదని సద్బ్రాహ్మణుల సమ్మతింపక యుండురా, అని యూహించి, ఆ వెలి రంగములను కల్పించితిని. నరసన్నభట్టు నిల్లు, ఒక గురుకులవాసమేయని రుజువు చేయుటకు, నారాయణశాస్త్రి పుల్లయ్యలను శిష్యులను కల్పించితిని. పుల్లయ్యను హాస్యరసమున నుపకరించులాగునఁ జేసితిని. అనువోతుని ఏకసంథాగ్రాహిగా నొనర్చి యతనికి భారవి కావ్యమును పాఠముగాఁ జెప్పించితిని. అనువోతుని పట్టాభిషేక సమయాన, నరసన్న మనుమఁడగు సోమేశకవి రచించిన "యాదవరాఘవీయ"మను సంస్కృత ద్వ్యర్థి కావ్యమును, నరసన్న శిష్యుఁడగు దేవులపల్లి నారాయణశాస్త్రి రచించినట్లు నిర్మించిన "సీతాకల్యాణ"మను ఆంధ్ర ద్వ్యర్థి కావ్యమును, రాజున కంకితము చేయించితిని. "యాదవరాఘవీయ" మిప్పటికిని వ్రాఁతప్రతిగా, కాకినాడలోని

ఆంధ్ర సారస్వత పరిషత్కార్యాలయమున నున్నది. కాని యది యనువోతుని కర్పింపఁ
బడిన కృతికాదు. నారాయణకవి రచిత కావ్యము కేవలకల్పితమే. రేచిగాని చరిత్ర
జరిగినదే.

ఈ రూపకకథ మొదటినుండి చివరవరకు నడుపించినవాఁడు నరసన్నభట్టు.
అతఁడే కథానాయకుఁడు. కావుననే యీ నాటకమునకు అతనిపేరే పెట్టితిని. ఇంకను
రావు అనువోతభూపతి విజయ వర్ణనము ముఖ్యగాథగాఁగలది కావున, దీనికి "అను
వోతవిజయ"మను పేరు పెట్టుమని కొందఱు సలహా యిచ్చిరి. కాని, అనువోతుని సుర
క్షిత జననమునకు, విద్యాభివృద్ధికి, ప్రాజ్యరాజ్య ప్రాప్తికిని కారణభూతుఁడు నరసన్న
భట్టు. కావున ఈ కావ్యమున కాతని నామముంచుటయే యెక్కువ సమంజసమనితోఁచి
నది. నరసన్నభట్టు కేవలము పండితపుత్రుఁడు కాఁడు; బహుశాస్త్రవేత్త, వేదవేదాంగ
పారంగతుఁడు, ద్రోణునివంటి అస్త్ర విద్యావిశారదుఁడు, చాణక్యుని బోలిన రాజ
కీయ తంత్రజ్ఞుఁడు, విశేషించి, స్వాతంత్ర్యార్థులవలె, యుగయుగ సంఘసంస్కారము
అత్యంతావశ్యకమని, తలపెట్టి ఆచరించుచున్నాఁడు. దేశము ప్రభుపాలకుల పాలుగాకుండఁ
గాపాడుటకై, అవమానితుఁడైనచంద్రగుప్తుని ఉపకరణముగా గ్రహించి, మౌర్యసామ్రాజ్య
స్థాపన చేయించిన చాణక్యుని వలెనే, పాషవర్గ్య బారినుండి అనువోతుని ఒప్పించి
పద్మనాయక వంశ రాజ్య స్థాపనకుఁ గారణభూతుఁడైన నరసన్నభట్టుకూడ తత్సమాన
రాజకీయతంత్రజ్ఞుఁడే. అట్టివాని అభిధేయమే గ్రంథమున కిడుట ఉచితమని నిర్ణయింప
వలసి వచ్చినది.

నాకువీలయినంతవఱకు నాటకలక్షణము ననుసరించియే రచన సాగించితిని. ముఖ్య
పాత్రల ప్రవేశనిష్క్రమణ సూచనలు, విష్కంభాది విభాగ రచనలు, కొంతవఱకు జరిపి
తిని. నటులకు సుబోధకముగా నుండుటకై పెక్కుతావుల సరళాదేశ సంధిని పాటింప
కుంటిని. వాక్యమధ్యమందు అచ్చులనుపయోగించితి— కనుక, విసంధులు విశేషముగా
వాడితిని. చాకలి పుల్లిగానికి, పాలికాపు రేచిగానికిని గ్రామ్య భాషా ప్రయోగమే
పాత్రోచితికై చేసియుంటిని. పండితులు నాలోపములను మన్నింతురుగాకయని కోరు
చున్నాను. నాటకము దృశ్యప్రాధాన్యము కలదని నమ్మి నటకుఁడ నగుటచేత, నాశక్తి
కొలఁది దీనిని ప్రదర్శనార్హముగ రచియించితిని. ఈ స్వాతంత్ర్యము సంస్కృత నాటక
కవులను దీసికొన్నదే. అనివార్యములయిన ముద్రారాక్షసములను చదువరులు సవరించు
కొందురుగాక !

రచయిత.

ఎం. వేం. నరసింహారావు.

# నాంది

ఓంకారాక్షరదివ్యరూపుఁడు, కళావ్యూహాధినాథుండు పు
ణ్యాంకూరప్రతతిప్రవృద్ధి రచనా ప్రావృడ్ఘనుం డుగ్రదై
త్యాంకారిందముఁ, డాశ్రితావన లసద్వ్యాపారదక్షుండు, శ్రీ
శాంకర్యాత్మజుఁడౌ గణేశుఁడు సదస్యశ్రేణిఁ గాపాడుతన్.

శ్రీ లీలాప్రతిభా క్షమాప్రణయగర్వీభూత చేతస్కలా
శ్రీలా నీలల ముష్టిపాన్ వశలుగాఁ జేపట్టి, పక్షోభుజాం
కాలంకారపద మ్మొసంగి శ్రితరక్షవాప్తి నూహించు గో
పాలుం డాశ్రిత కల్పభూరుహము సభ్యశ్రేణి రక్షించుతన్!

రేరే! చర్చిత చర్వణంబగు ధరిత్రీజన్ములై, సద్యశ
శ్రీ రాజ్యాధిపులై, నృసింహాంబయు, లక్ష్మీపుత్త్రులై, సత్కళా
సూరిప్రస్తుతులై, సుశీలవతులౌ శుద్ధాంగనల్ గొల్వ ధా
త్రీరంగస్థిత పాత్రలౌ జనుల, గౌరీ శంకరుం డోముతన్!

(నాంద్యంతమందున సూత్రధారుఁడు ప్రవేశించి, సూచన సాంగీతి నర్పించి]

సూత్ర: మారిషా!

మారి: ఏమి, బావా?

సూత్ర: ఏమోయి, నీ వెప్పుడును బని లేదు, తీరిక లేనట్లు లుందువు?

మారి: నాకా పనిలేదు? పనిలేని జీవులెందు బైన నుందురా? అకర్మలోఁ గర్మఁగనుఁడను గీతావాక్యమును భావింపుము.

సూత్ర: బాగు! బాగు! పనిలేనిపోవుట వెయిక్క పనియే యన్న మాట, నీవు చెప్పకయే నేను నీవలన మున్నె గ్రహించితిని. కాని, నీ గీతను బట్టి కర్మలోఁ గూడ నకర్మయున్న దేమో బాగుగాఁ బరిశోధించితివా?

మారి: బావా! గీతలలోఁ బాండిత్యము నీ కఖండముగఁ గుదిరినట్లున్నదే! గీతారహస్యము లేవేని నాకెఱింగింప నెంచి నన్ను రావించితివా?

సూత్ర: కేవలము గీతారహస్యమే కాదు, సాహిత్యసమ్మేళ సంగీత రహస్యమును నీకెఱింగించి, యొక రూపక మాడింపఁదలఁచితిని.

మారి: నే నాడువాఁడను గానే!

సూత్ర: అనవసరమై, మనసుకుదురుచో, నాఁడువాఁడవేగాదు, పాడు వాఁడవు గూడ, నీ వగుదువను ధైర్యము నాకులేకపోలేదు.

మారి: నీ ఛలోక్తులకేమిగాని, బావా, ప్రకృతవిషయము నెఱింగింపుము.

సూత్ర: ఒక నాటకప్రదర్శనమునకై తగుసేర్పాటులను గావించుచు శ్రాంతిగొంటచే, విశ్రాంతి నాసించి, మఱఁదివగు నీతోఁగొంత తడవు ఛలోక్తులాడితిని.

మారి: సరే; కాని, నాటకమంటివి, ఏ నాటకము?

సూత్ర: నరసన్న భట్టు — అను రూపకము.

మారి: కల్పిత కథా రూపకమా?

సూత్ర: కాదు, కాదు. చారిత్రాత్మకము.

మారి: ఈ చరిత్రాంశ మెందున్నది?

సూత్ర: ఎందా? వినుము.

భారతీ పాదపూజా రత్నపీఠికా
రాజ సంకాశ సద్రాజకులము.
చింతామణీ దివ్యసంతాన సురభి సం
తాన దానగుణ ప్రధానకులము.
పరమభాగవత సత్పురుషపుంగవజాత
పూత చిరంతన ఖ్యాతకులము.
గాంగేయ విజయ విక్రమకళా సముపేత
శూరాలవాల విశుద్ధ కులము
మల్లికా చంద్రహీరోపమాన కీర్తి
చంద్రికాసాంద్ర లలితావనీంద్ర కులము.
ఆంధ్ర మాతృ రచిత సుకృతైకఫలము
ప్రథిత రాట్పూరి రాజిత రావుకులము.

అట్టి రావుకులము వారిది, వారికి మంత్రులై పురోహితులై మహా పండిత కవిప్రకాండులను పేరుగడించిన వింజమూరి వారిదియు, చరిత్రలను, శ్రీ రావు గంగాధరరామరాయ ప్రభుని కార్యదర్శియగు శ్రీ వింజమూరి లక్ష్మణమూర్తిగారు, ఆంగ్లమున రచించిరి. నరసన్నభట్టు గాథ

దానిలోనిది. మహాకవి పుంగవులగు శ్రీ దేవులపల్లి తమ్మన్న శాస్త్రి గారు రచించిన "రావువంశముక్తావళి" లోఁగూడఁ దద్గాథకలదు.

వారు నరసన్న భట్టును వర్ణించుచు,

> అలఘు తపోధనుండు, నిఖిలాగమ ధర్మచయానువర్తి, ని
> ర్మల తరకీర్తి, సద్గుణసమగ్రుఁ డుదగ్రకుటుంబ వైభవా
> కలితుఁడు, వింజమూరి కులకంది సుధాంశుఁడు, సత్కృపా కరుం
> డల నరసన్నభట్టను ధరామరశేఖరుఁడొప్పు మెప్పుగాన్.

అని చెప్పినారు.

మారి: ఆరావు కులము మొన్న మొన్న దాఁక పీఠికాపురమేలు మహా రాజుల కులమా?

సూత్ర: ఒక్క పీఠికాపురమేలు వారి కులమే కాదు. బొబ్బిలి, వేంకటగిరి, మైలవరము, జటప్రోలు — సంస్థానముల నేలు పద్మనాయక వంశీయుల కులమును నగును.

మారి: ఆలాగైన, నరసన్న భట్టు కథ తత్సంస్థానాధీశ్వరుల చరిత్రలకు మూలాధారమైనదా?

సూత్ర: అవును, బాగుగా గ్రహించితివి. మండ దొరకుచో, మనుజునే మ్రింగు కొండచిలువవంటి యఖండ బుద్ధిమంతుఁడవు. ఇంక నీకుఁ జెప్ప వలసినది లేదు.

మారి: సరే, చరిత్రాంశమేదియు నీ వింకఁ జెప్పవలసిన యవసరము లేదుగాని, యేతన్నాటక కర్త యెవ్వరో కొంచెము నొడివెదవా?

సూత్ర: నీకు నాటక విషయము ప్రధానమా? తద్రచయిత ప్రసంగము ప్రధానమా?

మారి: రెండును ప్రధానములే. ఏలయన, ప్రసిద్ధకవి రచనము కానిచో, ప్రేక్షకులకు వృథాప్రయాసము గలిగించినవారమే యగుదుము. కావున, నాటకకర్తం గూర్చి యించుక మున్నెఱుంగుట ముఖ్యము.

సూత్ర: నిజమే. ప్రస్తుత కవి ప్రస్తుతకవియే. అంతమాత్రమే కాదు. ఆయన సుప్రసిద్ధనటుఁడుకూడ. ఆఱితేఱిన నటుఁడు రచించిన రూపకములు మిగులఁ బ్రదర్శన యోగ్యములుగా నుండును గదా?

మారి: అవును. ఆ నటకకవి పేరేమి?

సూత్ర: నరసింహారాయ కవి.

మారి: ఆ పేరుగల కవులు, ముఖ్యముగా నాటక కవులు, పెక్కండ్రు గలరుగదా, వారిలో నీతఁడెవ్వరు?

సూత్ర: కవియు, నటుఁడునునగు నరసింహారాయ నామధారులు పెక్కురు లేరనుకొందును. అయినను, ఈ నటకవింగూర్చి చెప్పెదను వినుము.

ఏకేశ్వరోపాస నైకాగ్రచిత్త ప్ర
    వృత్తి జీవకవి ద్వితతి నొకఁడు.
యువక హృద్వ్యాకృత వ్యవసాయ ఫలగుణో
    త్కర రచనా దేశికతతి నొకఁడు.
వినుతానుబంధ కవిత్వసముద్యోగ
    చాతురీ ధౌరేయ సమితి నొకఁడు.
ప్రకటాంధ్ర నాటకరంగాంబర స్థిత
    నటక నక్షత్ర గణమున నొకఁడు.

సర్వమానవ సౌభ్రాత్ర సద్గుణుండు,
మృదుతర శిరీషసుమసమ హృదయయుతుఁడు,
వింజమూరి కులాంభోధి విమల విధుఁడు,
వేంకట నృసింహరాయ కవి ప్రభుండు.

మారి: ఓహో! ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు సమున్నత పట్టభద్ర పరీక్షలకుఁబఠనీయగ్రంథముగా నియమించి గౌరవించిన "అనార్కలీ" యను దృశ్యకావ్యము, "నౌరోజ్" అను శ్రవ్యకావ్యమును రచించిన కవి తల్లజుండాతఁడు. నేనెఱుంగుదును.

సూత్ర: నీవేకాదు. సకలాంధ్రులలో నతని నెఱుఁగని వారుండరని నా నమ్మకము. ఆతఁడు బహు గ్రంథ రచయిత. కవిం గూర్చి మఱియు ముచ్చటింప సమకట్టుదుమేని, ప్రకృతకార్యారంభమునకు విలంబ మగును.

మారి: అట్లయినచో, నేతద్రూపక ప్రథమరంగ ప్రదర్శనమునకు భూమికల నాయిత్తపఱచుటకుఁ బోవుదమందువా?

[పోఁబోవును]

# ఈనాటకమున వచ్చు పాత్రలు

నరసన్నభట్టు ... కథానాయకుఁడు

కృష్ణసూరి ... నరసన్న పెద్దకొడుకు

సోమేశకవి ... కృష్ణసూరికొడుకు

వెంకన్న ... నరసన్నజ్ఞాతి. ప్రతికక్షి

రామన్న
దీక్షితులు
సోమన్న
సుబ్బయ్య
అన్నప్పసోమయాజి ... వెంకన్న మిత్రులు, వెలికిఁ దోడ్పడిన వారు

వెంకప్పగారు ... సభాధ్యక్షుఁడు

సభ్యులు ...

సీతారామశర్మ ... బాలకవి

రేచిగాఁడు ... పొలముకాపు

పుల్లిగాఁడు ... చాకలి

వేఁటసిబ్బంది, బ్రాహ్మణులు కొందఱు

నారాయణశాస్త్రి
పుల్లయ్య ... నరసన్న శిష్యులు

అనువోతుఁడు ... ఉప కథానాయకుఁడు

శీలవతి ... అనువోతునితల్లి

సీతాదేవి ... అనువోతుని భార్య

లచ్చమ్మ ... నరసన్నభట్టుభార్య

# నరసన్న భట్టు

## ప్రథమాంకము

### ప్రథమ రంగము

రంగము: ఒక యేటిగట్టు. తత్పరిసరముల నొకతోఁట.

ప్రవేశము: నరసన్నభట్టు ఇరువురు శిష్యులకు వేదశాస్త్రము చెప్పుచు.

నర: బిడ్డలార! ఆ తూర్పువంకఁ జూడుఁడు. సూర్యోదయ మెంత మనోహరముగ నున్నదో!

సీ॥ ప్రాగ్దిశాకాంత గర్భంబుఁ దాల్చెఁగఁ మోము
కళగాంచెననఁ దూర్పు తెలివిఁబొందు;
గర్భభారక్లాంతికలనఁ దద్భామిని
వలపునూర్పులనఁ దెమ్మెరలు వీఁచు;
నిరత నిశ్వాసజనిత బహుస్వేదబిం
దువులన మంచుబిందువులు దోఁచు;
ప్రసవవేదనచేతఁ బడఁతిమూల్గెడుననఁ
బక్షికూజితములు ప్రబలుచుండు;

గీ॥ పద్మనాయక కులపరిపాలకుండు
చక్రరక్షణ దక్షుండు సకలలోక
బాంధవుండిఁక నుదయించి భయదతమముఁ
బాపి జ్ఞానతేజమొసంగి, ప్రజలఁ బ్రోచు.

శిష్యుఁడు 1: విన్నావురా, తమ్ముఁడా గురువుగారెంత? చక్కఁగా అరుణోదయమును వర్ణించినారో!

శిష్యుఁడు 2: అపరప్రాచేతసులు. వారినోటినుండి వెలువడిన మాట యెల్ల సరసకవిత్వమే

శిష్యుఁడు 1: తమ్మన్నా! ఆ చెట్టుక్రింద చూడుము. ఎవతెయో పడియున్నది!

శిష్యుఁడు 2 : అన్నా ! ఆమె గురువుగారి వర్ణనకు సరిపోయిన రూపముతోఁగూడ నున్నదే !

నర : (శిష్యులతో ఆమెను సమీపించి) ఓరీ, కుఱ్ఱవాండ్రూ ! పాప మీపిల్ల యెవర్తెయో సొమ్మసిల్లినట్లు తోఁచుచున్నది. ఏటనీ రొకపాత్రతో తొందరగా తెండు. (శిష్యులు నీరు తెచ్చుటకు పరుగెత్తుదురు. నరసన్నభట్టు స్త్రీని బాగుగా పరికించి) ఈమె యాకారము గాంచిన, కట్టిన యుడుపులు పెట్టిన నగలును గనిన, గొప్పయింటి వనితలాగు కనఁబడుచున్నదే ! ఏల యిట్లు పడియున్నదో కదా ! (శిష్యులు నీరు తెత్తురు. నరసన్నభట్టు ఆ నీటిని స్త్రీ నోటిలోఁపోసి, మొగముపై కొన్ని నీళ్ళు చిలుకరించును. ఆమెకు తెలివివచ్చును) అమ్మా ! నీ వెవరవు తల్లీ? ఏల యిక్కడ నిట్లు పండి యున్నావు?

శీలవతి : (హీనస్వరముతో) అయ్యా ! నా-మ-అ-ది నేఁడీ?

నర : అమ్మా ! నీమఱఁది యెవరు? నీ చరిత్రమెట్టిది?

శీల : (కొంచెము తేఱికొని) స్వామీ ! నేను రావువారి కోడలను. పూసపాటి మాధవవర్మకు, మా అత్తవారితో విరోధము. అతఁడు చిరకాలామర్షము లోపలఁ బెట్టుకొని లెక్కకు మీరిన సమ్మరెడ్డి సేనలను తోడుచేసికొని హఠాత్తుగ మా వారి నెదుర్కొని సర్వనాశ మొనర్చినాఁడు. తమకిఁక అపజయము తప్పదని తలఁచి నానాథుఁడు నన్నుఁ దప్పతక్కుంగల రాణివాసంపు స్త్రీలనందఱను అగ్నిప్రవేశ మొనరింప ఆజ్ఞ యిచ్చియున్నాఁడు. నాచిన్న మఱఁది, వెన్నమనీఁడు నన్నే దేనిగ్రామముచేరువఁ జేర్పఁదలఁచి యిటడించి పోయియున్నాఁడు. తోడికాంతలందఱు 'జహర' వ్రతమాచరించితమ పతులకన్న మున్న స్వర్గమున కేఁగిరి. నిర్భాగ్యనగు నేను మాత్రము బ్రదికియుండి యిట్లువచ్చితిని. (ఏడ్చుచు) ఎవరియింటనైన దాస్యము చేయుచు కొంతకాలము జీవింప వలతును, తండ్రీ !

నర : సింగమ భూపాలు దేవివా? తల్లీ ! నీ కెట్టిగతి గలిగినది!

శీల : అవును, తండ్రీ ! నాగతి యింతకు వచ్చినది. (ఏడ్చును)

నర : అమ్మా! ఇంక వగవకు. నాకు కూఁతులులేరు. నీవు నాకూఁతు వేయని యెంచి నీఁకేలోపమును రానీయక కాపాడెద.

శీల : నాయనా! ధన్యురాలను. నన్ను మీ యిచ్చవచ్చిన సేవలో—

నర : బిడ్డా! నీవిఁక విశేషముగా వచింప నక్కఱలేదు. నా శిష్యులు తోడువత్తురు, మెల్లఁగా మనయింటికివెళ్ళు. స్నానసంధ్యాద్యనుష్ఠానములు ముగించుకొని, కొలఁదిసేపటికే యిల్లు చేరుదును. ఓరీ శిష్యులారా! మీరీమెను జాగ్రత్తగాఁ గొనిపోయి మా యింటియామె కప్పగించి, సర్వసదుపాయములును గావింప నా యాజ్ఞయైనదని చెప్పుఁడు. పొండు.

శీల : (భట్టారకుని పాదములకు మ్రొక్కును)

నర : దీర్ఘాయురస్తు! ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు! (భట్టు వడిగా ఏటిదరికిఁ బోవును. శీలవతి ఛాత్రులవెంటఁ బోవును)

## ద్వితీయరంగము

రంగము : నరసన్నభట్టు నింట నొకగది.

ప్రవేశము : లచ్చమ్మ (నరసన్నభార్య,) శీలవతియు.

లచ్చ : అమ్మా! దైవ నిర్ణయము నెవరు తప్పింపఁగలరు? ఊరకుండుము.

శీల : ఊరకుండక యేమిచేయఁగలను? కాని అన్నియు తెలిసినను, పూర్వచరిత్ర కళ్ళకు కట్టినట్టులుండి దుఃఖము వచ్చుచుండును.

లచ్చ : అంతయు నిజమే, తల్లీ! కాని, పడినగోడలు పడినట్లే యుండవుగదా? ప్రకృతమునీకు రాజ్యవైభవము లేక పోవచ్చును, గాని యింకేలోటును కలుగనీయమని నమ్ము. మాకాఁడు బిడ్డలులేరుగదా! నీవే మాయింటి యాఁడుఁబడుచు వౌదువు.

శీల : అమ్మా! మీరేలోపమును కలుగనీయరని యెఱుఁగుదును. ఎంతరాణివాసపు స్త్రీ నైన, మీవలె అన్నమే తిందునుగాని వెండి బంగారములు తిననుగదా? కాని,

సీ॥ ఆకాశవాహినీ యానమ్మునొనరించు
రాయంచనేలపై వ్రాలినట్లు
అత్యున్నత స్థితి నమరు నీహారాద్రి
పాతాళకుహరానఁ బడినయట్లు
క్షీణపుణ్యమ్మున స్వీయలోకమువీడి
తారకామణినేల జాఱినట్లు,
ఆనందనౌకా విహారమ్ము సమయాన
బుడుఁగున నుడుపమ్ము మునిఁగినట్లు

గీ॥ ప్రాజ్యరాజ్యాది వైభవ పదవిఁబాసి
అతినికృష్ట నీచస్థితి నందియుంటఁ
దల్లి! దుఃఖప్రవాహమ్ము వెల్లివిరిసి
వరదలై యొక్కతటి నిట్లు పాఱుచుండు

లచ్చ: అమ్మా! నీవన్నమాట నిజమే. ఒక్కొక్కప్పుడు ఆఁపుకొన రాని దుఃఖము వచ్చును. కాని, నీవొక రాచపడుచువన్న మాటే మఱచి, ఒక్క పేదబాపనుని యింటఁబుట్టి కాలవశమున మగనిఁగో ల్పోయిన ఒక సామాన్య స్త్రీవని యెంచుకొనుము. నీకడుపునఁ బెరుఁగుచున్న బిడ్డకొఱకు నీ దుఃఖమును దిగమ్రింగక తప్పదు.

శీల: పిన్నిగారూ! అన్నియు ఎఱుఁగుదును. అయినను,

గీ॥ దుర్భర విపజ్జలధర సందోహమొలసి
నా హృదయగగనమ్ము పూర్ణముగఁగప్పఁ
మఱినిరాశా ప్రశీతల మారుతమ్ము
పైనివీవ, బాష్పసలిలవర్ష మరుదె?

లచ్చ: అమ్మా! అటులే కావచ్చును. నీ హృదయాకాశమున ఎంతటి సాంద్రమేఘా లలమికొన్నను, ఆ చీఁకటులు పాపుటకు అచిరకాల ములోనే అందొక్కరిక్క యుదయింపనై యున్నది గదా! ఏల చింతింతువు?

శీల:

గీ॥ చండదుఃఖాతపాహతి నెండిపోయి
ఒక యెడారిగా మాఱ్పొందియున్న నుత్హృ
దయ వసుధ. తల్లి! నీదు సుధా ప్రపూర్ణ
భాషణాంబు సేచనమునఁ బదనుగాంచె.

అమ్మా! నిరంతరము నాతోనేయున్న మీ పనుల కడ్డంకి గానుందు నేమో! బాబయ్యగారు పొలమునుండి వచ్చువేళ యైనట్లున్నది. వారికేమి కావలయునో చూడుఁడు.

లచ్చ: అమ్మా! నీవు మాకెందును అడ్డంకిగా లేవు. మా పేద యింటికి నిజముగా సామ్రాజ్యలక్ష్మివలె వచ్చితివిసుమా!

శీల: (వాపోవుచు) విష్ణువు నెడఁబాసిన లక్ష్మి కేమి శోభ యుండును? (పావకోళ్ళ చప్పుడు వినఁబడు) అదిగో! బాబయ్యగారు వచ్చినట్లున్నారు.

నర: (ప్రవేశించి) కుమారీ! సులువుగా తిరుగుచున్నావా?

శీల: బాబయ్యగారూ! మీ ఆశీస్సు వలన సులువుగానే ఉన్నాను.

నర: శాస్త్రవాదములు పెట్టుకొని రాత్రి భోజనము ఆలస్యముగా నేయుట నాకలవాటు. కాని నీ భోజనమునకు వేళ మించరాదు గనుక, పెందలకడనే వచ్చితిని.

శీల: తండ్రీ! కృతజ్ఞురాలను.

నర: బిడ్డా! నీ నామ నక్షత్రాదులను బట్టి జాతక చక్రము వ్రాసి చూచితిని. నీ కీపున్నమలోపల పురుడు వచ్చును. సర్వ శుభలక్షణ శోభితుఁడగు సుతుఁడు ఉదయించును.

శీల: పార్వతీ పరమేశ్వరులఁ బోలియున్న మీ దంపతులకు నమస్కరించుటకన్న నేఁజేయునది లేదు.
(నమస్కరించును)

నర, లచ్చ: శీఘ్రమేవ సుపుత్రావాప్తిరస్తు! ఇష్టకామార్థ సిద్ధిరస్తు!

లచ్చ: అమ్మా! ఇంకలోపలి కేఁగుము. (శీలవతి పోవును)

నర: పాపమీయమ్మాయి దీనస్థితిఁజూడ, గుండె నీరై పోవుచున్నది. ఈమె సుఖ ప్రసూతయైనదాఁక జాగ్రత్తగా కాపాడవలయును. అబ్రాహ్మణస్త్రీ నొకర్తను నాయింటఁ బెట్టుకొని, కూఁతుగాఁ జూచుచున్నానని గ్రామస్థులు గుజగుజలు పోవుచుండిరి. కానిమ్ము, చూతును. వారినెల్ల నాప్రతివాద మంత్రములకు కట్టువడిన

త్రాఁచులం గావించెద. ఈ దురాచార పరాయణాలా నాలో తప్పులు పట్టఁగలవారు? ఈ మిష.చేనైన సంఘమును సంస్కరించెదను. లోపలికిఁ బోదము రా. (నిష్క్రమింతురు)

## తృతీయరంగము

రంగము : నరసన్న గృహము.

ప్రవేశము : నరసన్న, కృష్ణసూరి (నరసన్న కొడుకు,) లచ్చమ్మ, శీలవతి-నరసన్నభట్టు భాగవతములోని గజేంద్రమోక్ష ఘట్టము చదువుచుండును. నడుమ శిష్యుఁడు పుల్లయ్య రొఁజుచు వచ్చును.

నర : అదేమిరా? ఆలాగున వగర్చు చున్నావు?

పుల్ల : గురువుగారూ ! కొంపమునిఁగినది. మాధవవర్మ పంపిన గూఢ చారులు శీలవతీదేవికోసము వెదకుచుండఁగా, ఆమె యిక్కడ నున్నదని యెవరో వార్త మోసివేసినారఁట.

నర : అయిననేమి?

పుల్ల : వారు మనయిల్లు ముట్టడించి, శీలవతీదేవినికొనిపోయి మిమ్ము శిక్షించెదరఁట.

నర : ఇదియెల్ల నీకెట్లు తెలిసినది?

పుల్ల : నేను మాధుకరమునకై తిరుగుచుండ, మాధవవర్మ భటులు రామాలయపు చావడిమీఁద కూర్చుండి మాటాడుకొనుచుండఁగా, నేనంతయు విని యీ వంకకు చావుపరుగున వచ్చితిని.

కృష్ణ : తమ్ముఁడా ! గుండె ఆఁగక బ్రతికివచ్చినావుగద? సంతోషము !

శీల : బాబయ్యగారూ ! నామూలమున మీకెట్టి కష్టములు కలుగుచున్నవి ! ఇప్పుడీహావడి తప్పించుకొను మార్గమేది?

నర : అమ్మా భయపడకు. వారెట్టి చేటును కల్గింపఁజాలరనియే నా నమ్మకము. కృష్ణా ! దీనికంతకు కారణము నాకు తెలిసిపోయినది. మనజ్ఞాతి, వెంకన్నయే వృథామాత్సర్యము వహించి యీ కీడు కల్పించియుండును.

పుల్ల : గురువుగారూ! ఆ దుష్టులు సామవాక్యాలతో లొంగరని నా భయము.

కృష్ణ : ఓరి పిరికీ! ఇన్నాళ్ళనుండి మానాన్నగారి శుశ్రూష చేయుచుండియు వారిశక్తినే యెఱుఁగవటరా? ఆయన బార్హస్పత్య చాణక్య తంత్రాధ్యయన మొనరించిన మేటియని యెఱుఁగవా? ఏ యుపాయము చేతనో ఆ దుష్టుల తొలఁగింపఁగలరు. నీ వట్టులు వణఁక నక్కరలేదు.

పుల్ల : (బాలునివలె యేడ్చుచు) గురువుగారూ! నన్ను మా అమ్మ కప్ప గింపుఁడు. మా అమ్మకు నేనొక్కఁడనే కొడుకను.

నర : (నవ్వుచు) ఆ క్రూరులు నీవంటి మహాపరాక్రమశాలిని చంపినఁగాని, తమజయము పూర్తిగాదని యెంతు రనుకొంటివా?

శీల : బాబయ్యగారూ! ఆ హంతకులు మీకు లోఁపడిన, మేలే. కాకున్న, మీరు కొంకక నన్నర్పింపుఁడు. అంతియేకాని నామూలాన ఇడుమల పాలుకాకుఁడు.

లచ్చ : అదేమిటి తల్లీ! నిన్ను శత్రువుల కప్పగింతుమా? మమ్ములను కడతేర్చికాని, శత్రువులు నిన్ను తాఁకలేరు.

కృష్ణ : సోదరీ! ఆ క్రూళ్ళలు నీకొఱకుఁగా దిచ్చుటకె వచ్చుట. నీ కడుపునఁ బెరుఁగు బిడ్డకోసము. "శత్రోశ్శేషమ్ న శేషయేత్" అను రాజనీతి మాధవవర్మ దెయుండును. కాని, వెఱవకు. తండ్రిగారేదో తగిన యుపాయమును యోజించియే యుందురు.

(తలుపుమీఁద గ్రుద్దులచప్పుడు వినఁబడును)

పుల్ల : (ఉలికిపడి) ఓయినాయనో! వారువచ్చినారయ్యా! అమిద్దెమీఁద దాగుకొనెద.

నర : ఓరీమూర్ఖుఁడా! అల్లరిచేయకు. మేము జీవించియుండఁగా నీ కెట్టి భయమును కలుగదు.

పుల్ల : మీరును జీవింపరనియే నా భయము.

నర : ఎంతధైర్యశాలివిరా ! నీ యిచ్చవచ్చినచోట, దాగుకో ! కృష్ణా ! తలుపుతెఱచి, వచ్చినవారు శత్రువులైనను జంకక, సగౌరవముగా లోనికి తీసుకొనిరా.

(కృష్ణసూరి యేఁగును, పుల్లయ్య నాలుగుమూలలకు పరుగులెత్తి, ఒకమూల నక్కియుండును. కృష్ణసూరి మాధవవర్మతో, అతనిఅనుచరులతో ప్రవేశించును)

కృష్ణ : దయచేయుఁడు. వారు మాతండ్రిగారు, నరసన్నభట్టారకులు.

మాధ : ఏమయ్యా, భట్టారకా ! నీవు మా శత్రువు భార్య కాశ్రయమిచ్చితివఁట. నిజమా?

నర : తమ శత్రువెవ్వఁడు? అతని భార్యయెవర్తె?

మాధ : ఏమీ, తెలియనట్లు మాటాడుచున్నావే !

నర : ఎవరికెవరు శత్రువులో, యెవరు మిత్రులో తెలిసికొనుటకు మాకేమి యవసరము? మాకెల్లరు మిత్రులే.

మాధ : ఓహో ! మాకు మాటలతో పనిలేదు. వినుము. రావువారు మా విరోధులు. వారికోడలు మీ యింట నున్నదఁట. అవునా కాదా?

నర : రావువారి కోడలు మాయింట నేట్లుండును?

మాధ : (కోపముతో) ఆలోచించి మాటాడుము. వృథాగా కష్టాలు పాలుగాకు.

నర : మహారాజా! ఇంతకు ముందు తమ ప్రతాపానలము బహువిరోధినృపాలవంశకాననముల దహించి విశేష సుకృత మార్జించియే యుండును. దానికితోడీ బ్రాహ్మణ విధ్వంస పుణ్యము కూడ మూటఁగట్టుకొనఁదలఁచితిరా? కానిండు, మీ పరిశోధన.

(తన్ను జంపుదురేమోయని పుల్లయ్య కెవ్వన నొక్క కేక పెట్టును)

మాధ : ఓపిరికి బాపఁడా ! నీబోటివారిని చంపుటకు మేము రాలేదు. మీయింట దాఁచిన కాంతకొఱకు వచ్చితిమి. అగ్రకులజుల మని విడ్డి వీఁగక, ఆమెను మా కప్పగింపుఁడు.

నర : మాకాభిజాత్యములేదు. జాతిమత కులభేదములు మానవకల్పిత ములు. ఈశ్వరుఁడు లోకపితయైనప్పుడు మనమందఱము ఏకకులము వారము. ఏక కుటుంబము వారమును అగుదుము.

మాధ : మీకట్టి అభిప్రాయములున్నవని తెలిసినా, బ్రాహ్మణేతర కులజయైన మానైరికాంత మీయింట నున్నదన్న నమ్మితిమి.

నర : మా అభిప్రాయములు పలువురకుండి వచ్చును. వారి గృహము లును ఇట్లు పరిశీలించితిరా?

మాధ : ఇఁక మాకు మీతో వాదించుటకు కాలముచాలదు. అగ్ని, ఋణము, శత్రువు, శేషింప నీయరాదన్న రాజనీతి మీకును దెలిసి నదే! మాధర్మ పరిపాలన కడ్డువచ్చిన వారిని ఎదురింపకమానము. ఇంక మాటలు కట్టిపెట్టి మీయింట నున్నవారి నందఱను మాకుఁ జూపి వారు నీకెట్టి చుట్టాలో విశదీకరింపుము.

నర : అయ్యో! తప్పక చూపెదను. మా బావన చెలువలకు తమలో వలె 'ఘోషా' లేదుగదా? అందఱు నిచ్చటనే యున్నారు. ఇతఁడు నా కుమారుఁడు, ఈతఁడు నా శిష్యుఁడు, ఆముసలిది నాయిల్లాలు. గర్భవతియగు ఆయింతి నా పుత్రిక. వీరే నా కుటుంబములోని వారలు.

మాధ : ఆయింతి మీ పుత్రికయగుట నిశ్చయమా?

కృష్ణ : మాతండ్రిగారు తమపుత్రికయని స్పష్టముగా చెప్పుచుండఁగా, మీకు సంశయమేల?

మాధ : ఆమె మీలో నెవ్వరిని పోలియుండక పోవుటచే అట్లనుచుచున్నాము. ఆమె సౌకుమార్యము చూడ, రాణివాసపు వనిత యట్లు తోఁచుచున్నదే!

కృష్ణ : ఆమె మగఁడు మహైశ్వర్య సంపన్నుఁడు. కాని కాలక్రమమున ఆ సంపదలెల్లఁ గోల్పోయి, కాశికి పోయినాఁడు. ఈమె నిచ్చట దిగవిడిచినాఁడు. బహుసంపదలందియుంటచే సుకుమారత్వ మొందియున్నది. అంతే!

మాధ : మీయింట వంట యెవ రొనరింతురు?

నర : నా భార్యయే.

మాధ : నీ కూఁతు రేల చేయరాదు?

నర : చేయ కేమి? గర్భభారము వలనఁ బ్రస్తుతము చేయఁజాలదు.

కృష్ణ : పుట్టినింటికి వచ్చిన యాఁడుపడుచును సుఖపెట్టుదురుగాని, వంట లోఁబెట్టి కష్టపెట్టుదురుకదా?

మాధ : భూసురులారా ! మీ రెన్ని చెప్పెదరు, నమ్మఁజాలకున్నాను. ఆ చిన్నది బ్రాహ్మణి కాదనియు, మీకుఁ గూఁతురు కాదనియు, మాకొక విప్రుఁ డీయూరివాఁడే చెప్పినాఁడు.

నర : ఆ విప్రుఁడు మూర్ఖుఁడై, మాయెడ మాత్సర్యము గలవాఁడు. మఱొకఁడెవ్వఁడైన ఆమాట చెప్పిన, తాము నమ్మవచ్చు.

మాధ : ఓహో ! మేము నామముచే బ్రసంగించుకొనెడి మీసుత్రాఁగ వారు చుండిరే ! ఆమె మీ కూఁతురు కాదనుము, కాకపోనిమ్ము. మా కప్పగింప వలయును.

నర : మా కూఁతును మీ కప్పగించుట యేమి న్యాయము?

మాధ : మాకుఁ దోఁచినదే న్యాయము. ఓరీ ! ఈ బ్రాహ్మణులను బంధింపుఁడు.

పుల్ల : (ఏడ్చుచు) ఓ ముసల్మాన్ ! నాకును నీకును నేఁటితో ఋణము చెల్లినదే ! (భట్టు చెయ్యి పట్టును)

నర : (పిడికిలించుకొని కోపముతో)

శా॥ ఓ రాజాధమ ! విప్రశాపవచనాత్యుగ్ర ప్రతాపాగ్నిచే
నీ సమృద్ధులు కూలిపోయెదు సుమీ నీ పుత్రమిత్రాళితోఁ;
పాడిమ్మండఁగఁబోలు నీ మరిత భావస్ఫూర్తి ; కాకున్న నీ
తీరౌనే? బహుసాత్త్వికాళి నిటు బాధింతే, మదాంధుండవై ?

మాధ : (కొంచెము శాంతించి) భట్టారకా ! ఏలయంత యాగ్రహము? ఓరీ భటులారా ! దూరముగాఁ దొలఁగుఁడు.

నర : సత్వగుణప్రధానులమైన మమ్ము ద్వేషించిన మా గుణము మాని పోవును. మీ దౌర్జన్యమువీడి మీ పీటికిఁ జనుఁడు.

మాధ : అటులే పోయెదము. కాని ఆమె మీ కూఁతురని మాకు పరిపూర్ణవిశ్వాసము గల్గింపుఁడు.

నర : అందులకేమి చేయుమని సెలవు?

మాధ : మీరామె చేతికూడు భుజింపవలెను.

నర : భుజింపకేమి?

కృష్ణ : కాని. అది మీ యొసగుట నెట్లు?

మాధ : మేముకూడ ద్విజులమే కదా! దానికితోడు మీకు కుల భేదాలు లేవనుచున్నారు గదా?

నర : తప్పక తిందును. ఈ రాత్రికే నా భోజనమును నీవే దయచేయుఁడు. ఎట్టి అడ్డంకియులేదు.

మాధ : సరియే. మరలఁ గలసి కొందము. (నిష్క్రమణ)

పుల్ల : అమ్మయ్యా! నా ప్రాణములిప్పుడు కుదుటఁబడినవి. వారు మరల రాకుండఁగనే, మాయింటికి కదలాయెదను.

కృష్ణ : ఇంటికేగినను, వెంటఁబడుదురేమో! జాగ్రత్త! పిచ్చి పుల్లయ్యా!

శీల : బాబయ్యగారూ! కృతజ్ఞురాలను. (నమస్కరించును) ఋషిసత్తములరగు మీరు నాకొఱకు అనృతము పలుకఁ బూనితిరి గదా!

నర : అమ్మా! నా అనృతములు దోషరహితములు. అవి స్వార్థమభిలషింపక, ఒక యబలా ప్రాణరక్షణార్థం పలికినవి.

కృష్ణ : ఇదే శుక్రనీతి సారము.

పుల్ల : ప్రాణము మీఁదికి వచ్చినప్పుడు శుక్రనీతిలేదు, గురు నీతియు లేదు. కాఁపుఁదలకుఁ బనికివచ్చున దేదియో అదే నీతి.

నర : అమ్మాయీ! శీలవతీ! సాయంకాల భోజనమునందు మాకన్ని పదార్థములను నీవే వడ్డింప వలయును. నీచేతి ప్రసాదము నాకు జగన్నాథ ప్రసాదమే.

కృష్ణ : ఇది ఆపద్ధర్మమై, పాటింపఁ దగ్గదేయైనను, సాంఘిక మర్యాద నతిక్రమించిన వారమౌట బహిష్కరింపఁ బడుదుమేమో !

శీల : అన్నా ! నాకొఱకు నిందలపాల్గాకుఁడు.

నర : కుమారా ! నిందవచ్చునని ధర్మము నెరపకుండుట మందగుణము. కానిమ్ము. మన దుష్టబంధువు సాంఘిక దండయాత్ర చేయించి, మనలను వెలివేయించిన, వారి సందఱను హేతువాదము లోనికి దింపి ఓడింప నలయును. కృష్ణా ! నీవు పాండిత్యమున నాయంత వాఁడవుగదా ! స్మృతి, శ్రుతి, పురాణేతిహాసములఁ దిరుగవేసి ధర్మచర్చకు సిద్ధపడియుండుము. తల్లీ ! శీలవతీ ! నీవిఁక లోనికిఁబోయి విశ్రాంతిఁదీసికొనుము. నేను శిష్యులకు పాఠాలు చెప్పివత్తును.

## ద్వితీయాంకము

## ప్రథమ రంగము

రంగము : వీధి.

ప్రవేశము : వెంకన్న. దీక్షితులు.

వెంక : బావా ! మానరసన్న చేయుచున్న ఘోరకార్యము గురించి విన్నావా?

దీక్షి : విన్నాను, విన్నాను. అంతగొప్ప పండితుఁడు, కవియుఁగా ! వానికేమి పోఁగాలము వచ్చినది?

వెంక : నిజముగా పోఁగాలమే వచ్చినది. శూద్రస్త్రీ చేతికూడు, అబ్రాహ్మణులు కొందఱు చూచుచుండఁగా, భుజించినాఁడఁట.

దీక్షి : ఆలాగున భుజించినంత మాత్రాన మాధవవర్మ నమ్మినాఁడా?

వెంక : నమ్మక యేమిచేయును ! మీరెవ్వరును నోటముద్ద పెట్టుకొని మాటాడరైతిరి ! మాధవవర్మ అడిగిన ప్రశ్నలకు జంకక కొంకక జవాబు చెప్పినవాఁడను నేనే, మీకందఱకు నరసన్న యన్న భయము, మొగమోటమును గల్గుటచేత సత్యముపలుకకుంటిరి.

దీక్షి : మనగ్రామమువారే కాదు, ఆంధ్రదేశములో నెల్లరు గర్వ పడవలసిన మహాపండితుఁడు నరసన్నభట్టు. అతఁడు చేసినది తప్పు పనియేయైనను, ఎదుర్కొన సాహసింప లేకపోయితిమి.

వెంక : పండితుఁడే తప్పుదారిని బోవునప్పుడు, మఱింత తిరస్కరింప వలసినది. మాధవవర్మ భట్టుమాటలు నమ్మినట్లు నటించినను, లోన ననుమానము పొందక పోలేదు.

దీక్షి : అనుమానమున్నదని యెట్లు తెలిసి కొంటివి?

వెంక : భట్టారకు నిల్లు వీడి పోవునపుడు "ఓయీ బ్రాహ్మణుఁడా! ఇప్పటికి నీబోలికి రాక మేము పోవుచున్నాము. మాకూఁతురు నీళ్ళాడిన తర్వాత మరల వత్తుము. ఆమెకుఁ బుట్టినబిడ్డ యెవరి పోలిక నుండునో చూడవలయు." నన్నాఁడు మాధవవర్మ. కనుక అతనికి సందేహ మున్నదన్న మాటే.

దీక్షి : అట్లైన, నరసన్నకు, అతఁడు పోషించుచున్న వెలమపిల్లకును ఇంకను ఆపదయున్న దనుకోవచ్చును.

వెంక : ఆ! ఉన్నది. వర్మ వానియిల్లువీడి ఈవలకు వచ్చుచుండఁగా "తడప మిన్నాగుతైన దన్నట్లు, నాకూఁతునకుఁ బుట్టుశిశువు చెలరేఁగి శత్రువును చెనక కుండునా?" అని మెల్లఁగా పల్కినాఁడు. వర్మ వినియు విననట్లు నటించి పోయినాఁడు.

దీక్షి : సరే! ఇప్పుడేమి చేయఁదలఁచితివి?

వెంక : ఊరి బ్రాహ్మణులనందఱను శివాలయములోనికి రావించియొక సభ చేయుదము. బ్రాహ్మణ ధర్మమే నశించు నప్పుడు మనము మిన్నకుండరాదని వారికి బోధించెదను.

దీక్షి : సభ చేసినంత మాత్రాన నరసన్న లొంగునా?

వెంక : అందఱమును గలసి వానిని వెలివేయుదము. అప్పుడు లొంగ కేమి చేయును? గ్రామస్థులందఱు వానిని చండాల సన్నిభునిగాఁ జూచునప్పుడు లొంగుటయే గాదు, పాదాక్రాంతుఁడగును.

దీక్షి : ఏమో! అదంతయు జరిగినప్పటి మాట.

వెంక : బావా! నీవు, రామన్న, సోమన్న, సోమయాజులు-- అంద అును నా పక్షమున నిలుతురేని, నరసన్నను, మూడు చెరువుల నీళ్ళు త్రాగింతును.

దీక్షి : నీకు, అతనికి, ఏవో మనస్పర్థలున్నవి గనుక, నీవు శ్రద్ధ వహించి బహిష్కరణ విషయములో యత్నింతువు. తక్కుంగల గ్రామస్థుల కేమి పట్టినది? వారెవ్వరును కూడిరారు.

వెంక : కూడిరాకేమి? గ్రామస్థులకు వింజమూరి నారసన్న, కోపమే. ఈసడుము సతేనిమంది, కృష్ణయ్య "వాల్మీకి కులసంఘ" మను, నొకనూలవారి సమితి, యేర్పాటుచేసి, వారికి పాటలు నేర్పుచు ఊరి వెంబడి తిరుగుచుండుట నీ వెఱిగినదే కదా?

దీక్షి : తెలియును. ఆ ముచ్చటలన్నియు విన్నాను, కన్నాను. ఈ యిద్దఱను వెలివేయవలెనని నా సలహా.

వెంక : మంచిమాటగాక! నీవు మాత్రము నావైపున నిలువఁబడుదువు గాక! అదియే పదివేలు. ఈ సాయంకాలము దేవాలయములోను రాత్రి యిండ్లకడను, అందఱను గలసి మాటాడుకొని మూడు నాల్గు దినాలలో సభ జరుగు నేర్పాటు గావింతము.

దీక్షి : నీవుపూనిన కార్యము విశేష భారము గలది. భద్రముసుమా! నలువురిలో మనమాట నెగ్గవలయు. అంతియేకాని, అవమానము కలుగరాదు. పోదముపద. (నిష్క్రమింతురు)

## ద్వితీయ రంగము

రంగము : ఊరిబయట నుండుతోఁట. అందు చాఁపలు పఱచియుందురు. సభాపతి కూర్చుండుటకు ఒక రత్నకంబళము, దానిముందర నొక వ్రాఁతబల్లయు అమర్తురు.

ప్రవేశము : సభ్యులు, వారిలో దీక్షితులు, వెంకన్నయు సభ నడుపువారు.

దీక్షి : (లేచినిలువఁబడి) సోదరులారా : నేఁటిసభకు బ్రహ్మశ్రీ వంక వెంకప్పశాస్త్రిగారగ్రాసనాధిపతులుగా నుందురని కార్యదర్శిమాకు

తెలియఁజేసినదే యున్నాఁడు. శాస్త్రులవారినెఱుఁగనివా రీప్రాం
తాన నుండరు. ఇప్పుడు బయలుదేఱు తరుణ వయస్కులగు పండి
తులలో పెక్కండ్రు వారి శిష్యులే. వారు వ్యాకరణశాస్త్రమందే
గాక, శ్రౌతములో, జ్యోతిషములోఁ గూడ విశేష పాండిత్యము
గలవారు. వారికి సనాతన హిందూ ధర్మమనిన మిక్కిలి యభిమా
నము. ఆ యభిమానమే వారి నీయధ్యక్ష పదవికి రావించినది.
అట్టి ప్రజ్ఞాధురంధరులు నేఁటి మనసభ నధ్యక్షత వహించుట మన
భాగ్యమనక తప్పదు. ఇంక కాలహరణముచేయక వారి సధ్యక్షత
వహింపుఁడని మీయందఱ తరఫున వేడుచున్నాను. (వెంకప్ప గారు
లేచి అగ్రపీఠ మలంకరింతురు. వెంకన్న పూలమాల వెంకప్ప గారి మెడలో
వైచును. సభ్యులు కరతాళధ్వనులు చేయుదురు)

వెంక : (లేచి) మహాశయులారా ! నేఁడు మీరు నన్నీ యున్నత పద
వికి రావించి కావించిన గౌరవమునకు కడుంగడు కృతజ్ఞుఁడను.
కాని నాపై మీరు వైచిన కార్యభారము మాత్రము దుర్భరమై
నది. నరసన్న భట్టారకుని బహుశాస్త్రజ్ఞానము, నిరర్గళ వాక్ప్రా
టవమును ఎల్లరెఱింగినవే. అతనికన్నంటఁదగిన ఔరసుఁడని చెప్పఁ
దగ్గవాఁడతని కుమారుఁడు, కృష్ణసూరి. వారిపై మోపఁబడిన నింద
లనుగూర్చి చర్చించుటయన, నాబోటివానికిని సాహసమనక తప్పదు.
అయినను ఇది మతాచార ధర్మ నిరసనమగుటచే యోక్యము కలుగఁ
జేసికొనవలసి వచ్చినది. మన బ్రాహ్మణ కులము వర్ణములలో
అగ్రగణ్యము. "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" అని వేదము చెప్పు
చున్నది. శమము, దమము, తపస్సు, శుచిత్వము, ఆర్జవము, విజ్ఞా
నము, ఆస్తిక్యబుద్ధి- ఇవి బ్రాహ్మణుని కుండవలసిన ముఖ్యగుణ
ములు. వీనిలో నేది లోపించినను విప్రత్వము చెడినదని వచ్చును.
పై గుణములు పాటించుటకే స్నానసంధ్యావందనాద్యనుష్ఠాన
ములు పంక్తిభోజననియమములు మున్నగునవి పెద్దలు నిర్ణయించిరి.
మన నరసన్నభట్టారకుఁడు హిందూమత ధర్మములు, ముఖ్యముగా
బ్రాహ్మణ ధర్మములు, తప్పి చరించు చున్నాఁడు. అది చింత్యము.
తదౌచిత్యానౌచిత్యముల చర్చింతుముగాక. మొదట వింజమూరి

వెంకన్నగా రుపన్యసింతురు. దయచేసి వినుఁడు. (కరతాళధ్వనులు, వెంకన్నగారు లేచుచుండఁగా యువకులలో కలకలము)

వెంక : (కలఁతపడుచు లేచి, గొండినుండి పాదుముకొయ్యఁదీసి, ఒకపట్టుపాదుము పీల్చుకొని) ఆర్యులారా! మిమ్ముఁరావించిన పనిని గురించి అధ్యక్షుఁడుగారు కొంత చెప్పిరి. నాకుపన్యాసము లిచ్చు అలవాటులేదు గనుక నాకుబదులు దీక్షితులుబావగారు మాటాడుదురు. సద్దుచేయక వినఁగోరెద.

దీక్షి : ఆర్యవర్యులారా! సోదరులారా! వెంకన్న బావగారి కుటుంబమునకు నేను పురోహితుఁడనని మీరెఱింగినదే. వారు తామొన రించు పితృకార్యాదుల యందువలె నేఁటి సభా కార్యము నందును మంత్రతంత్రము లెల్ల నాకే విడిచిపెట్టి. తాము విశ్రాంతి కేసికొన నెంచిరి. వారిపని "మమ" అనుట మాత్రమే.

సభ్యుఁడు 1 : అంతమాత్రమే కాదు, ప్రాచీనావీతి కూడ ఆచరింప వల యును. (హాస్యధ్వనులు)

దీక్షి : బావగారు తాము వచింపఁబోవు మాటలను వ్రాసి యిచ్చిరి. దానిని చదువుచున్నాను. వినుఁడు. "నరసన్న గొప్పపండితుఁడని అందఱకుఁ దెలియును. కాని, అతఁడీనడుమ సల్పిన కృత్యమే మిగుల శోచనీయమైనది. పద్మనాయక కులస్థురాలు, రావువారి కోడలునగు నొకయిల్లాలి కాతఁడాశ్రయ మిచ్చుట గ్రామస్థులకంద ఱకుఁ దెలిసినదే. అదియెంతయుఁ బ్రశంసనీయమే అయినను, అతఁడంతటితో నూరకుండక, ఆవెలమ చేడియ చేతికూడు కూడ తినుచున్నాఁడు. అతనిపొలము దున్నుపాలికాఁపు కేచిగాఁడను నొక మాల వాని పిల్లలకు చదువుచెప్పుచు, వాని మఱఁది కృష్ణయ్యా పంచమ కులోద్ధరణము కావించుచున్నాఁడు. ఇవి బ్రాహ్మణాచార ములకు విరుద్ధములయినవి. కనుక, పండితులు, బంధువులు అని సం కోచింపక ఆ యిరువురను, వారి కుటుంబములను, మన బ్రాహ్మణ సంఘమునుండి బహిష్కరింప వలయును. శరీరావయవములలో నొకటి కుళ్ళిపోవఁగుచున్నప్పుడు దానిని ఖండించి శేషాంగ శ్రేణికి

రక్షణ చేయుట పాడిగాదా! మీరే లెస్సఁగా యోజించి కర్తవ్య మూహింపుఁడు. నా దగ్గరచుట్టమునే నే నిట్లు నిందింప వలసివచ్చెఁ గదాయని వగచు చున్నాను.

సభ్యుఁడు 2 : నేఁటి సభా కార్యదర్శిగారు ఈ మాత్రపుటుపన్యాసము నయితము చెప్పఁజాలక, యితరులచే వ్రాయించుకొని వచ్చుటయే గాక, యింకొకనిచేఁ జదివించునంతటి చిన్నఁదనపుంబనికిఁ గడంగుటకు మేము మఱియు వగచుచున్నాము.

అధ్య : ఎల్లరకు వాగ్ధాటి లెస్సఁగానుండదు. అంత మాత్రమున అధిక్షేపింపఁజనునా? ఊరకుండుఁడు. రెండవ వక్త అన్నప్ప సోమయాజిగారు.

అన్నప్ప : నరసన్నభట్లు రచించిన నటన యెంతమాత్రము తగదు. అంతటిపండితుఁడట్టినైచ్యమున కొడిగట్టుట శోచనీయ మనక తప్పదు. మత్స్య మాంసములుదిను శూద్రులతోఁ గలసి భుజించుట మన బ్రాహ్మణకులమునకు బొత్తిగాఁ దగదు. వేయిమాలకాకులలో నొక కోయిలవలె కృష్ణయ్య ఆ మాలలతోఁ గూడి యూరేఁగుట మఱియు నసహ్యముగా నున్నది. వారు చిన్నవారేమో చీవాట్లు పెట్టుదమన్న సర్వమెఱిఁగిన పండితులు, కవులును. అయినను వారు చేసినది తప్పేఁబని గనుక, వారిని బహిష్కరింప వలయును.

సభ్య 1 : సోమయాజులుగారు బాగుగా మాటాడిరి. ఎవ్వరైనను కార్యదర్శిగారికంటె మేలే.

అధ్య : సోమయాజులుగారి తీర్మానమును సోమన్నగారు బలపఱిచెదరు.

సోమ : అవును, నే బలపఱుచు చున్నాను.

సభ్యు : ఆహా! మహోపన్యాస మిచ్చితివయ్యా!

అధ్య : ఇమ్మట బాలకవి సీతారామశర్మగారు కొన్ని పద్యాలు చదువుదురు.

దీక్షి : (ప్రక్కనున్న సభ్యునితో అపవారించి) వీని పద్యములు నేనే దిద్ది యిచ్చియితిని సుమీ.

రామ :

> గీ॥ ఆర్యులార ! హిందూమతపర్యులార !
> చిన్నవాఁడను నైన నా విన్నపంబు
> శ్రద్ధతోవినఁగోరెద బుద్ధిమీఱ
> తప్పులున్నచో క్షమియింపుఁడొప్పుగాను.

సభ్యు 3 : ఈ బాలకవిగారు బొత్తిగా చిన్నవారు కవిగారుగా నున్నారే! పద్యములో యతులు గతులుఁజూడ అతులితముగ నున్నవే!

దీక్షి : యతులకేమి లోపమయ్యా! చక్కఁగాఁ ప్రాసయతులు పడినవే!

సభ్యు : బాలకవికా, ఎవరికా?

దీక్షి : ఆ పద్యములు నావి కావే! నేనించుక దిద్దిపెట్టితిని, అంతే. అయినను, అతఁడు "తప్పులున్నచో క్షమియింపుఁ" డనుచున్నాఁడే!

సభ్యు 3 : "తప్పులున్నచో క్షమియింపు డొప్పుగాను" అని చెప్పుకొనుమయ్యా, బాలకవీ!

అధ్య : అయ్యలారా! ఇతఁడు బాలుఁడు. ఉత్సాహముతో నేవియో కొన్ని పద్యములు రచించి కొనివచ్చినాఁడు. వానిలో మంచిని గ్రహింప వలెఁగాని, తప్పు లేకరువుపెట్టవచ్చునా?

సభ్యు : మంచియున్న, అట్టిదే గ్రహింతుము లెండు. కానిమ్మయ్యా, బాలకవివర్యా!

రామ :

> గీ॥ భట్టుగారినడత యేమి బాగులేదు;
> శూద్రకూఁడు తిన్నారఁట, భద్రమగునె?
> బ్రాహ్మణోత్తములై యట్టి పాడుపనులు
> చేయవచ్చునా? బొత్తిగా సిగ్గుగాదె?

సభ్యు 1 : ఓహో! ఏమిపద సౌష్టవము! ఏమిసమాసరచనా చాతుర్యము! మేలు, మేలు! బాలకవీ! బళీ! దిద్దిపెట్టిన దీక్షితకవీ!

రామ:

గీ॥ మాలవారికై పాటలు లీలఁజేసి
వారలను రాచకొని తిర్గచూరివెంట
బయలుదేరెడు కృష్ణయ్య, భట్టుమఱఁది,
వెలినివేయఁదగినవాఁడె, యిలనుదలఁప.

సభ్యు 3: ఆహా! దీక్షితులుగారు చెప్పినట్లుగానే, బాలకవికి ప్రాస యతు లప్రయత్నముగా నెంతచక్కఁగాఁ గుదురు చున్నవి! "తిర్గ చూరివెంట"—ఎంత ముద్దయిన సంధికూర్పు!

రామ: (కోపముతో) అయ్యా! నన్ను నూటికి మాటికి ఆక్షేపించు చున్నారు. మీరీమాత్రపుఁ గవిత్వము చెప్పుఁడు, చూతుముగాక! తప్పులు పట్టుట కారంభింతుమేని నన్నయ్యభట్టు కవిత్వములోఁ గూడఁ బట్టవచ్చును.

సభ్యు 2: అవును బాబూ! నీవంతటి సమర్థుఁడవే! ఇప్పుడీ భట్టు చరిత్రలోఁ దప్పులుపట్టు చున్నవాఁడవు, ఆ భట్టుకవిత్వ బట్టలేవా?

దీక్షి: అయ్యలారా! మీరిట్లు బాలుని బెదరఁగొట్టుట, తగవు గాదు. అతనిశక్తి మీరు పరీక్షఁ జేయఁబూనుదురేని మీకుఁదోఁచిన యంశమునుఁ గూర్చి యాశువుగ నొక పద్యముఁ జెప్పుమని కోరుఁడు. ఎంతచక్కఁగాఁ జెప్పఁగలఁడో మీకే విశదము కాఁగలదు.

అధ్య: సోదరులారా! మీచర్యలు నేనొప్పను. సభలో నొకఁడు మాటాడుచుండ నింకొకఁడు డష్టుపల్కరాదు. నాయనా! తక్కిన పద్యములు చదువుము.

సభ్యు 2: (అపవారించి ప్రక్కవానితో) ఓయిబాబో! అధ్యక్షుఁడుగారు శాసించు చున్నారురా! ఇంకమన నోళ్లకు తాళములు వైవవల యును గాఁబోలు. వాని పద్యములు ముగియనీ. వెంకప్పగారినే కందపద్యాలలో వర్ణింపుమందము. పని బయలుపడును.

సభ్యు 1: సరే.

రామ : చదువుమని సెలవా?

సభ్యులు : ఆఁ ! సందేహమేమి?

రామ :

గీ॥ శ్రుతులు, స్మృతులు, పురాణముల్ చోద్యముగను
కావ్యము, లితిహాసములును గలుగుమతము
పెక్కువేలేండ్లనుండియుఁ బెరుఁగుమతము
ఇలను మతరాజమనఁదగు హిందుమతము.

సభ్య 4 : భళీ ! సీతారామశర్మ ! హిందూమత ప్రాశస్త్య మిప్పుడు చక్కఁగా బోధపడినదోయి ! "చోద్యముగను" అను పదము ఎంత చోద్యముగాఁబడినది !

రామ :

గీ॥ అట్టిమనమతమె చెడెడునట్టివేళ
నూరకుందురే, కిమ్మన కూరివారు?
ఇంక కల నరసన్నకృష్ణయ్యగార్ల
వెంటనే వెలివేయుఁడీ వేగముగ.

(కరతాళధ్వనులు)

సభ్య 3 : భేష్ ! బాలకవీ ! మీపంచపద్యరత్నమాల ప్రపంచమునఁ జిరస్థాయిగా నుండఁదగ్గదోయి ! దానిచే నలంకృతుఁడవైన నీవు పంచశరునివలెఁ బ్రకాశించు చున్నావు. ఈ కడపటి పద్యములోని కడపటిపాద మెంత రసవంతముగాఁ బడినదోయి ! సార్థకమైన పదాలతో నిండియున్నది.

అధ్య : ఆర్యులారా ! పాపమీబాలుని నూరక కలఁత పెట్టితిరి కదా ? అది న్యాయమా ?

సభ్య 2 : అయ్యా ! సంతోషము పట్టఁజాలక మేము పల్కిన మాటలను సైరింపుఁడు. బాలకవీ ! అన్యథా తలఁపకుము.

సభ్య 3 : ఆశువున ఘనుఁడవని నీగురువుగారు పల్కుచున్నారు. ఏదీ, రెండు కందములలో మనయధ్యక్షుల వర్ణింపుము. చూతము, నీ తెలివి దేటలు !

రామ: ఓ! అదెంతపని! వినుఁడు! (తడవుకొనుచు పైకిఁజూచుచు)

కం॥ కప్పయెలుఁగుతో శ్రీ వెం
కప్ప సుపండితుఁడు హాయిగా వేదపునోర్
విప్పఁగఁ గుప్పలు కుప్పలు
మెప్పులు సభికులు విడుచు సుమి యలబుధుపయిన్.

సభ్యు 2: (పెద్దనవ్వుతో) హాయి, హాయి! శబ్దాలంకారాల కుప్ప! సరళమైన నడక! మేలు మేలు!

దీక్షి: ఊరక ఆక్షేపించుటగాదు. ఇట్లు కవిత చెప్పఁగలవారు మఱెవ్వరు? గొగ్గినడక యున్నదని కాంబోలు మీ యనుమానము? యతులెంత ధారాళముగాఁ బడినవి! "సభికులు విడుచు" అన్న ప్రయోగము—ఇది సంఘువాచకము. దీనిక్రియ యేకవచనములో నుండవచ్చును. ఇట్టి ప్రయోగములు భారతములో లక్షోప లక్షలు చూపఁగలను.

అధ్య: అయ్యా! ఇట్లు మీరందఱును నాయనుమతిలేనిదే మాటాడఁగూడదు. ఇఁక నేనొప్పను. కూర్చుండుఁడు. (సభ్యులు మిన్నకుందురు) మఱియెవ్వరైనఁ బ్రసంగింపఁ దలఁచిరా? (ఎవ్వరును మాఱుపల్కరు) పోనిండు. ఎందఱు భట్టారకుని పక్షముననుందురో, యెందఱు వ్యతిరేకులై యుందురో నిర్ణయింపుఁడు. అంత తీర్మానము ధ్రువపఱుతము.

సభ్యు 3: అయ్యా! తీర్మానము ధ్రువపఱుచుట కదినన్యముగా జరిగినప్పుడుగదా! దాని నామోదించువారు లేకయే బలపరిచిరి. అది యట్లుండ, మనము వ్యతిరేక పక్షమువారి వాదము కూడ వినవలదా? ఇప్పుడు చెప్పినవారిమాటలలో సహేతుకమై, యుక్తియుక్తమై, శాస్త్రసమ్మతమై, యనుభవసిద్ధమగు వాదమెద్దియు వినఁబడి యుండలేదు. కనుక, సభ మఱొకనాఁటికిఁ బెంచి యానాఁడు భట్టారకునిగూడ రావించి యతనివాదము కూడ వినుటయుక్తము.

వెంక: అందఱును సభకురాఁగా, నరసన్న యేల రాఁగూడదు? అతఁడెప్పుడును రాఁడు.

(తెరలో : "రాకేమి? ఇదే సపరివారముగా వచ్చుచున్నాఁడు. మీ హృదయ కవాటములఁ జొచ్చుచున్నాఁడు. మీ కర్ణరంధ్రముల బ్రవచ్చుచున్నాఁడు. మీ సంకల్పదధులఁ ద్రచ్చుచున్నాఁడు")
(ప్రవేశము కృష్ణసూరి, శిష్యులతో)

గీ॥ ఔర ! బ్రాహ్మణబంధువులార ! పూత
జాహ్నవీతోయ సదృశ స్వచ్ఛహృదయుండు
దేవగురుసమాన నయకళావిదుండు
మజ్జనకుఁడొప్పఁడే యార్యమత వివక్ష?

గీ॥ అగ్నిపర్వతాంతర్గతంబౌ పదార్థ
మట్టు లాత్మమాత్సర్యమ్ము నణఁచిపెట్టి
మా సమీప బాంధవుఁడె నేఁ డీసరణిని
వెడలఁగ్రక్క, దవ్వుగఁబోవఁ గడఁగరేల?

సీ॥ సతము వేశ్యలయిండ్ల నలిపెడు కామతం
త్రమ్ములే వేద సూత్రములుగాఁగ
నిరత మన్యధనాపహరణ కృత్యంబులే
ఆత్మప్రధాన కృత్యములుగాఁగ
అనిశ మసత్యసాక్ష్య ప్రయోగంబులే
కర్తవ్యకృతి నియోగములుగాఁగ
అనయమ్ము స్వీయలాభార్థచింతనములే
తమినొనరుచు మంతనములుగాఁగ

గీ॥ బ్రతుకు నామమాత్ర ద్విజవర్గమెల్లఁ
పంక్తిభోజనార్హమగునే? వీరివలన
మీ పవిత్ర హిందూమత మేపగిఁదిని
నిలిచియున్నదో తెల్పుఁడో కలుషమతులు !

మ॥ అమితైశ్వర్యములంది, దీనజన సాహాయ్యమ్ముఁగావించి పే
రిమి గన్నట్టి సుశీల, కాలగతిచే శ్రీలెల్లఁ గోల్పోయి స్వీ
యమహానందనికేతనుం బతిని, బ్రేమాధారమౌ బంధువ
ర్గమునుం గోల్పడి, యాశ్రయం బడుగఁ జేక్పం బాపకార్యంబొకో ?

మ॥ కడునార్తిం జనుఁదెంచు నట్టియబలన్ గాపాడఁగర్తవ్యమో,
విడువందగ్గ పురాణమూఢమత సంవిద్భావమే ముఖ్యమో,

యెదఁదల్ పిచ్చి పరీక్షఁజేసికొన మీకే గోచరంబయ్యెడిన్.
చెడుదారింబడి పోకుఁడీ, గురుల నిందింపన్ మహాఘంబగున్.

(ప్రవేశము నరసన్నభట్టు సంభ్రమముతో)

నర : కుమారా! నీవేల తొందరపడి వచ్చితివి? ఎందులకీ కంఠశోషము?

కృష్ణ : నాన్నగారూ! కూళలు కొందఱిచ్చటఁగూడి వృథాగామిమ్ము నిందించుచున్నారని విని వారి నోళులు గట్ట వచ్చితిని.

నర : నాయనా! వారివలెనే నీవును నిందకు దొరఁకొన్న, నీగొప్ప యేమున్నది? అధ్యక్షా! నా కుమారుఁడు దూరాలోచనము లేక తొందరపడి పలుకుచున్నాఁడు. వానిని క్షమించి మీ కార్యముల జరుపుకొనుఁడు.

అధ్య : ఈసభ మిమ్ము, మీ మఱంది కృష్ణయ్యగారిని, బహిష్కరించుటకై, కావింపఁబడుచున్నది. ఇందందఱు మీ ప్రతికక్షుల వలెనే కనఁబడుచున్నారు. మీ వాదము కూడ వినవలెనని యిప్పుడే యనుచున్నాము. అంతలో మీ కొడుకువచ్చి ఆశువునఁ బద్దెములు చెప్పినాఁడు. అవియెంతయో రసవంతములుగా నున్నవి. తగినవేళకే మీరును దయచేసితిరి. మీ ప్రతివాదముకూడ వినఁ గోరుచున్నాను.

నర : మహాశయా! ఇది మాజ్ఞాతి సంవాదముగాని, మత వివాదము కాదు. "షడ్ఢక షడ్ఢకశ్చైవ, ముష్టియుద్ధం పునఃపునః" అనువాక్యము మీరును వినియే యుందురు. మఱి వెంకన్నకు నాపై చిరకాలామర్షము గలదు. అదియే యీ సభకుఁ గారణము. మతములేదు, గతములేదు.

వెంక : ఇది కేవల మసత్యము.

సభ్యులు : కూర్చుండు, కూర్చుండుము (అని కేకలు, కలకలము)

నర : అసత్యముకాదు, ముమ్మాటికి సత్యము. మా యాంతరంగిక విరోధకారణము లిచ్చట వెలువరుప నిష్టపడను. మా స్వతంత్ర భావములు, మా యుచ్చస్థితిగతులే మా బందుగునకు మత్సర కారణములు.

ఇంక నాశూద్రాన్న భుక్తి విషయము — శీలవతి రావుసింగమ
భూపాలుదేవి. ఆమె సమస్త బంధువులను గోల్పోయి, అగతికయై
యుండియు, గర్భవతియై యుంట, సంతానకాంక్షచే జీవింపఁదలఁచి
యున్నది. ఈశ్వర సంకల్పముచే ఆమె నాకన్నులఁ బడినది. నే నా
మెను నాకూఁతుగాఁ బెంప నిశ్చయించి యింటికిఁ గొనివచ్చినాను.
పిమ్మట శత్రువులకీవార్త యెవఁడో పాపాత్ముఁడు తెలియఁజేసినాఁడు.
(సభలో కలకలము) వారు మాయింటికి వచ్చి శోధనలు చేసిరి. ఆమె
నాకూఁతురని విరోధి నమ్మలేదు. అతనికి నమ్మకము గల్గించుటకు
ఆమెచేతి కూడు తినవలయునన్నారు. ఒక్క యబలా ప్రాణరక్ష
ణము గావింపనా, బ్రాహ్మణాచారమే పట్టుకొని ప్రాఁకులాడనా—
అని యించుక యోజించినాను.

"బ్రహ్మవా ఇదమగ్ర ఆసీదేక మేవ" అను నుపనిషద్వాక్యము
జ్ఞప్తికి వచ్చినది. ఈ జగమంతయు మొదట బ్రాహ్మణ జాతిగానే
యుండెఁగదా. ఆవల వృత్తులంబట్టి యేర్పడిన వర్ణభేదమును జ్ఞానులు
పాటింపరాదుగదా— అని యూహించితిని. మన హిందువుల సాంఘి
కాచారము లన్నింటిని, నూహా ప్రపంచము మీఁద నాధారపడి
యున్న కొన్ని మతసూత్రములతో జతపఱచి వానిని సృష్ట్యాది
నుండియు భగవంతుఁడే నిర్మించెననియు, అవి యవిలంఘ్య నియమ
లనియు నమ్ముచున్నారు. సనాతన హిందూధర్మ పోషకులమని
విఱ్ఱవీఁగు వారెల్లరు ఈ విశ్వాసమునకు దోహద మొసఁగు
చున్నారు. అది మనసంఘాభివృద్ధి కెంతయు భంగకరము. విప్లవము
వచ్చినప్పుడెల్ల మన సాంఘికాచారములు యుగ యుగముల
మారుచున్నవి. కనుక ప్రాఁత పద్ధతులను అవసరము వెంబడిని
త్యజింప వచ్చునని స్ఫురించినది. గుణముచే వర్ణనిర్ణయము చేయ
వలెఁగాని జాతిచేఁగాదు. బ్రాహ్మణుని కుమారుఁడు బ్రాహ్మణుఁడై
యుండనక్కరలేదు, ఒక న్యాయాధికారికొడుకు న్యాయాధికారిగానే
యుండక పోవచ్చునట్లు. ధర్మాచరణముచేత నికృష్టవర్ణములు
ఉత్తమవర్ణములుగను, అధర్మాచరణముచే ఉత్తమ వర్ణములు నీచ
వర్ణములుగను మారొందుచుండు. ఆపస్తంభసూత్రములఁజదివి

చూడుఁడు. ఈ విషయము లన్నియుఁ దెలియఁగలవు. గీతారహస్యము, ఉపనిషద్సారమును లెస్సఁగా భావించిచూడ, సర్వమానవ సౌభ్రాత్రమే గోచరించుచున్నది. ధర్మశాస్త్రములను బట్టి నడచు కొందమన్న, అవి పరస్పర విరుద్ధములు. మన మెన్నో కృత్యములు శాస్త్రములకు వ్యతిరేకముగా ఆచరించు చున్నాము. ఆచరింపక తప్పదు. ఆపద్ధర్మములని పేరుపెట్టి యెప్పటి కప్పుడు మార్పులను చేయుచున్నాము. ఇప్పుడాపనియే చేయవలసి వచ్చినది. శీలవతి చేతికూడు తినుట తప్పుగాదని తోఁచినది. దురాచార పరుఁడైన బ్రాహ్మణునిచేతియన్నము దురన్నమనియు, సదాచార పరుఁడైన శూద్రుని చేతికూడు సదన్నమనియు, నామతము. శీలవతి సదాచార సంపన్నురాలు. ఆమె వడ్డించిన యన్నము ఆప్యాయముగా భుజింపఁదగ్గది. ఈశ్వర పితృత్వము, మానవసౌభ్రాత్రము పాటించువారందరు నాతో నేకీభవింతురని నా నమ్మకము. ఇంక నిశేషముగా వచింపను. ఇంటియొద్ద నాకూఁతు రించుక బద్ధకముగానున్నది. శీఘ్రముగాఁ బోయెదము, సెలవుదయచేయుఁడు. మీరాయిచ్చవచ్చిన తీర్మానములు చేసికొనుఁడు. అవి మమ్మేమియు బాధింపవు.

(ప్రవేశము పుల్లయ్య)

పుల్ల : గురువుగారూ ! శీలవతీదేవికి మగపిల్లవాఁడు పుట్టినాఁడు. అమ్మగారు మిమ్ము వేగముగాఁ గొనిరమ్మని పిల్వ ననుఁబంపిరి. దయ చేయుఁడీ !

నర : సభ్యులారా !

ఇదినా కంచిత యోగకాలమగు దౌహిత్రుండు జన్మించుటన్;
మదినూహింప నవగ్రహా లుచితధామాలం బ్రవేశించి య
భ్యుదయప్రాప్తినిదెల్పి జాతకునకున్ బూర్ణాయురైశ్వర్య సం
పద సూచించెడు; పద్మనాయకకులప్రఖ్యాతి వర్ధిల్లెడున్.

కడుశుభలగ్న మియ్యది, యఖండ ధనంబు హఠంబునన్ లభిం
చెడు ఘనసూచనల్ హృదయదృష్టికి గోచరమయ్యెడున్, మహా
త్ముఁడు యుగపూరుషుండను ప్రభూతయశంబును గాంచి, మన్మఁడీ
బుడమిని బాలనంబు సలుపున్; మది నమ్ముఁడు నాదు జోస్యమున్

పిల్లవానికి అర్హావిధిని జాతకర్మసంస్కారములఁ గావింపవలెను. మీ యందఱ కాహ్వానములఁ బంపెద, మాయింటికి దయచేసి శిశువును నాశీర్వదింపఁ గోరుచున్నాను. నాయనా! రండుపోదము.
(నిష్క్రమించును)

(సభ్యులెల్లరు కలకలధ్వనులతో సభవీడిపోవుదురు)

అధ్య: వెంకన్నగారూ! నేను సభ ముగింపనిదే యెల్లరు వెళ్ళి పోవుచున్నారు. ఇంక మన తీర్పులు వట్టి యార్పులే. నరసన్నభట్టు వాదము సహేతుకమై హృదయంగమమై యున్నప్పుడు, మీ వాదము వినువారెవ్వరు? మీరు, పాపము, వృథాశ్రమ పడినారు. మీది అసమకక్ష. బలవంతులతో మీకీపోరాటతగదు. పోవుదము రండు.

వెంక: కలికాలము! కలికాలము!

(నిష్క్రమింతురు)

## తృతీయాంకము

### ప్రథమరంగము

రంగము: నరసన్నభట్టు నింటివసారా.

ప్రవేశము: నారాయణశాస్త్రి, పుల్లయ్య.

నారా: పుల్లయ్యా! రేపేసుమా నా ప్రయాణము!

పుల్ల: ఆలాగునా? నారాయణా! నీవదృష్టవంతుఁడవురా, చక్కఁగా విద్యముగించి, స్వతంత్ర జీవన మొనరించుటకుఁ బోవుచున్నావు.

నారా: ఏ మదృష్టమురా? తొమ్మిదేండ్లయి వచ్చితిని. ఇన్నాళ్ళకు మూఁడుశాస్త్రములు మాత్రము ముగిసినవి. అంతేగదా?

పుల్ల: నేను నీకన్న నాలుగేండ్లు ముందుగ వచ్చితిని. శీలవతీ దేవి ఇచ్చటికి రాకమునుపే నేను ప్రవేశించితిని. ఇంకను గావ్యపంచక మైన ముగింపఁజాల కుంటిని.

నారా: నీకొక వ్యావృత్తియా? అన్ని పనులు నీకే కావలయుఁగదా? ఇంటెఁడు చాకిరీయు నీవొక్కఁడవే యేల చేయుదువురా? మొదలే

మందబుద్ధివిగదా, దానికిఁదోడీచాకిరీ యేమిరా? ఒక్కనాఁడేని పట్టుమని యొకగంటసేపు చదివిన పాపాన పోలేదుగదా?

ఫుల్ల: ఏమి చేయుమందువురా? గురువుగారే కాక యూరివారెల్లరు నాకే పనులు నియోగింతురు. ఇఁకఁ జదువెట్లు సాగును? నాకుఁ దోడుగా గురువుగారి రెండవకొడుకున్నాఁడు. వాఁడుతిండికిఁ దిమ్మరాజు-పనికిఁబోఁతురాజు! వాఁడేపనియుఁ జేయఁడయ్యె.

నారా: ఆకారణముననే మిమ్మిద్దఱను ఒకకాఁడి యెద్దులఁగా గురువుగారు ఉపయోగించు కొనఁదలఁచు చున్నారు.

ఫుల్ల: నాకండ్లయెదుటఁ బుట్టిన శీలవతీదేవికొడు కెంతచుఱుకుగా విద్య నేర్చుచున్నాఁడురా? ఒక్క శ్లోకము కంఠస్థము చేయుటకు నాకు నాల్గు దినాలు పట్టును. అనువోతయ్య పది పంద్రెండు శ్లోకాలు దినదినము గురువుగారి కప్పగించును.

నారా: అనువోతయ్యది ఉద్దండపుఁ దెలివిరా? అతనికిఁగావ్యపాఠము లెంతవఱకైనవి? నీకెంతవఱకైనవి?

ఫుల్ల: చెప్పుకొన్న సిగ్గు. నాకన్న నేమ వెనుకలలో నుండియుఁ బది దినాలక్రింద నన్నుఁ గలసికొన్నాఁడు. మేమిప్పుడు భారవి చదువుచున్నాము. నేనింకను మొదటి సర్గలోనే యున్నాను. అతఁడు రెండు సర్గలు ముగించినాఁడు. శీలవతీదేవి మంచి యదృష్టవంతురాలు సుమీ!

(ప్రవేశము శీలవతి)

శీల: నాయనలారా! మా యబ్బాయి యున్నాఁడా?

నారా: గురువుగారితోఁగూడి పొలమునకుఁ బోయి యున్నాఁడు. ఒక్కజాము ప్రొద్దెక్కు వఱకు నచ్చటనే యుందుమని చెప్పి పోయిరి.

శీల: ఓహో, అదా? తెలిసినది. నేఁడొక నూతన విద్యోపదేశము బిడ్డకుఁ జేసెదమని బాబయ్యగారు సెలవిచ్చిరి. ఈ యాలస్య

ఘంటుదునకే కావచ్చును. చూడు నాయనా! మాపిల్లవాఁడు రాఁగానే ముందుగా అవ్వగారి కడకుఁ బోవలసినదని వానితోఁ జెప్పుము.

నారా: అమ్మా! అంత ముందుగాఁ బోవలసిన పనియేది వచ్చినదో?

శీల: బాబూ! నేఁడు వాని పదుమూఁడవ జన్మదినము. అవ్వగారు వాని కారతులిచ్చి, తలయంటి, క్రొత్త యుడుపులు గట్టఁబెట్టుదురఁట. దానికొఱకే యామె పేరఁటాండ్రతో నెదురుచూచు చున్నారు.

నారా: అలాగైన మన అనుమోతయ్యకు బాల్యావస్థదప్పి కౌమారము ప్రారంభమైనదన్నమాట. నేఁడేదోయొక నూతనవిద్యబోధించుటకే కావలయు, గురువుగా రింత తడసిరి!

శీల: అవును, బాబూ! వాని కస్త్రవిద్య నేర్పెదరఁట.

పుల్ల: ఓయినాయనో! అస్త్రవిద్యయే? అదినేర్చి మాయందఱమీఁద బాణములు ప్రయోగించును గాఁబోలు!

నారా: ఏడిచినట్టులే యున్నది నీ తెలివి! నిన్నుఁ గొట్టియేమి, వీధిలోని కుక్కను గొట్టియేమి? గురువులసంకల్పము మహత్తరమై యుండును. అమ్మా! మీ నుడులు వినుట కెంతయు సంతసముగ నున్నది. విశ్వామిత్రుఁడు శ్రీరామచంద్రునకు శస్త్రాస్త్ర ప్రయోగ పద్ధతి బోధించినాఁడు. అతఁడావిద్యచేఁ గ్రూరరాక్షసుల మర్దించి లోకోపకార మొనరించినాఁడు. అటులే అనుమోతయ్య కూడఁ గావించుననుట కేసందియము లేదు.

శీల: మీ యాశీస్సువలన అటులేయగుఁగాక! (నిష్క్రమించును)

పుల్ల: ఈయమ్మదెంత సాత్విక స్వభావమురా! పల్లెత్తి యొక్కమాటాడఁగా నీమెను నేఁజూడలేదు.

నారా: బ్రతికిచెడ్డ పడఁతి. ఆమెకట్టి గుణాలుండుట యబ్రమా;

పుల్ల: ఆమెమాటకేమిగాని, నారాయణా! విద్యముగించి యిండ్లకేఁగిన తర్వాత మనము ప్రాయశ్చిత్తకర్మముఁ జేయించుకొనవలెను గాఁబోలు!

నారా: ఎవనికిరా, ప్రాయశ్చిత్తము? కావలసియున్న, నీవు చేయిం చుకో, నా కక్కఱలేదు.

పుల్ల: అలాగైన, గురువుగారి చర్య తప్పు గాదందువా?

నారా: కాదనియే నా దృఢవిశ్వాసము. నా విశ్వాసమును మార్చి కొనను. దానిని నిలువఁబెట్టుటకై వలయుచో, నా పెద్దలయాజ్ఞను ధిక్కరింతును.

పుల్ల: నాకట్టిది సాగదురా. గురువుగారి సంఘ సంస్కరణోద్దేశములు సమస్తాంధ్ర దేశమునందును వ్యాపించి యున్నవి. మానాన్నకును తెలిసినవి. మొన్న మకరసంక్రాంతికి నేనింటికివెళ్ళినప్పుడు పంచగవ్య ములనిప్పించిన పిమ్మటఁగాని, నన్ను లోపలికి రానీయలేదు. అకారణ ముగాన ఇంటికిఁ బోకుండుటయే మేలని తోఁచుచున్నది.

నారా: పోకు. మాధుకరభిక్షు లభించి సన్నాళ్ళు ఇచ్చుటనేయుండుము ఇంటికిఁబోయి మాత్రమేమి చేయుదువు?

పుల్ల: ఏమి చేయుదునా? పెండ్లాడుదును. సుఖముగాఁ గాఁపుర మొన ర్తును. ఈ బ్రహ్మచర్యాశ్రమములోనే యెల్లకాలముండు మందురా, గురువుగారు?

(ప్రవేశము నరసన్నభట్టు అనువోతునితో)

నర: శాశ్వత బ్రహ్మచర్యమే బ్రహ్మ నీనొసట వ్రాసినట్లున్నాఁడు.

పుల్ల: అయ్యో! తమరే అట్టులన్న, నాముందుగతియేమి?

నర: నీగతిని నిర్ణయించుకొనుట నీలోనున్నది. విద్యయేమియు అంట కుండెను. చూడు మీ చిన్నిపాపని, నీకండ్ల యెదుటఁ బుట్టిన మన యనువోతుని! కావ్యపాఠాలలో నిన్ను మించిపోయినాఁడని గుర్తించి నావా? నీతో సమానముగా విద్యారంభము గావించిన మా మను మఁడు సోమేశము చదువు ముగించి ద్వ్యర్థి కావ్యరచనకే పూని నాఁడుగదా?

పుల్ల : ఎంత చదివిన నంతమంచిదని, సదా చదువుచుందును. నేను గట్టిగాఁదలపెట్టుదునేని, ద్వ్యర్థికావ్యమేకాదు, త్ర్యర్థి కావ్యము కూడ రచింపనా?

నర : (నవ్వుచు) అంతటి సమర్థుఁడవే! ఎల్లకాలమిట్లు చదువు కొను చుందుము. దాననే నీకుఁ బరిణయ మక్కఱలేదంటిని.

పుల్ల : పోనిండు. ఆంజనేయునివలె బ్రహ్మచర్యదీక్షలోనే యుండిపోయి కీర్తి గడింతును లెండు.

నర ? చేష్టలచేఁ గ్రోఁతివంటి వాఁడవే! తోఁకయొక్కటే నీకుఁదక్కువ. ఓరీ! నారాయణా! నీ ప్రయాణమున కన్నియు సిద్ధము చేసి కొనుము. ఇంటి కేఁగి గృహస్థాశ్రమ స్వీకార మొనరించి, మన యను వోతయ్య మహారాజైనపుడు మరలరమ్ము. నీవు, మనసోమేశమును అతని కాస్థాన కవులై యుండవలెనని నాసంకల్పము.

నారా : తమరు సంకల్ప సిద్ధులు, ఇదే అభివాదము లొనరించు చున్నాను. (సాగిలపడి గురువునకు మ్రొక్కును) అనువోతయ్యా! నీకడఁ గూడ సెలవుఁ గైకొనుచున్నాను. దైవానుగ్రహముచేతను, గురువరుల యాశీః ప్రభావముచేతను, నీవు క్రమ్మఱ క్షమాధవుండ వగు భాగ్యమే కల్గునేని, సింహపీఠిని గూర్చుండి నీవు నిండు కొలువుండు నపుడు, నీ దర్శన మొనరింతును. అయ్యెడ నీ పేదబాపనుని విస్మరింపకుమీ! సాందీపని కడఁ జదువుకొన్న కుచేల కృష్ణుల చరిత్ర మదిని నిల్పుకొనుము.

అను : సోదరా! నీ యాశీస్సునకుఁ బాత్రుఁడనగు నేను నిన్ను విస్మ రింతునా?

గీ॥ తన సహాధ్యాయుఁడౌ కుంభజుని మఱచిన
పార్షదునిపాటు గురువుల వలన వినియు
గర్వినై సహపాఠి నేకరణి మఱతు?
చెలిమికన్న నధికమౌనె కలిమిబలిమి?

నర : నాయనా! మంచి మాటాడితివి. నేఁటి పాఠమునకు రెండు శ్లోకాలు మాత్రము చెప్పి విడిచి పెట్టెద. పుస్తకములఁ దెచ్చు

కొనుము. పుల్లయ్యా! నీవుకూడ పుస్తకముఁ దీయుము.

పుల్ల : చిత్తము. శీలవతీదేవి తన కుమారుని శీఘ్రముగా లోపలికిఁ బంపుమన్నది. నేఁడాతని జన్మదినమఁట. అవ్వగారు ముత్తయిదువులచే ఆరతు లిప్పింతు రఁట.

నర : అది తెలిసియుండియే నేఁటికి రెండు శ్లోకాలే బోధింతు నంటిని.
(అనువోతుఁడు, పుల్లయ్యయుఁ బొత్తములం దెచ్చుకొని నిలుతురు)
నాయనలారా! కూర్చుండుఁడు. ఒక శ్లోకము చదివి అర్థము చెప్పెదను. మీరు శ్రద్ధగా విని వెంటనే దాని నప్పగింపవలయు. చూతునుగాక మీ ధారణశక్తి.

శ్లో॥ "సహసావిదధీతనక్రియా మవివేకఃపరమాపదాంపదమ్
వృణుతేహివిమృశ్యకారిణం గుణలుబ్ధాఃస్వయమేవసంపదః"

క్రియామ్=పనిని, సహసా=శీఘ్రముగా, నవిదధీత=చేయఁగూడదు. అవివేకః=వివేకింపకపోవుట, పరమాపదాంపదమ్=విస్తారములయిన ఆపదలకు స్థానమగును, గుణలుబ్ధాః = గుణములయందాశ కల్గిన, సంపదః=సంపత్తులు, విమృష్యకారిణం = విమర్శించి చేయువానినిఁ స్వయమేవ=తమంతట తామే, వృణుతేహి=వరించు చున్నవి.

తా॥ త్వరపడి యేపనిని జేఁయగూడదు. ఆలోచింపక పోవుట గొప్ప యాపదలకెల్ల మూలమగును. విమర్శించి కార్యములు చేయువానిని సంపదలు తమంతట తామే వరించుచున్నవి.

అను : (చిఱునవ్వుతో) తాతగారూ! మరల శ్లోకమును జదువుమందురా?

నర : చదువుము, నీ యద్భుత ధారణశక్తి వెల్లడింపుము.

అను : చిత్తము (ఇంచుక తడవుకొనుచుఁ దప్పులేకుండ శ్లోకమును నప్పగించును)

నర : మేలు, బాలకా! మేలు మేలు! పుల్లయ్యా! నీవుకూడ నప్పఁజెప్పుము.

పుల్ల : తొందరపడి యేకార్యమును జేయరాదని తమరే సెలవిచ్చితిరి గదా! నేనేల తొందపడి అప్పగింప వలయు?

నారా : ఈ కుయుక్తులేల? నాకు రాలే దనుము.

పుల్ల : ఏమంత మునిఁగినదని నామెదడు పాడిచేసికొని శ్లోకమంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకోవలయు?

నర : నీ తెలివికి మెచ్చితిమి. ఇఁక నీళ్ళుతోడుటకుఁ బెరటిలోని కరుగుము.

పుల్ల : ఆలాగుననే వెళ్ళెదను. కాని నాకొక్క యనుమానము గలదు.

నర : అదేదో చెప్పు, తీర్చెదను.

పుల్ల : మీరిప్పుడు చదివిన శ్లోకము మనయనువోతయ్య నేఁడుచదువ వలసిన పాఠములోని దేకదా?

నర : అవును, అయినచో?

పుల్ల : ఆతఁ డీపద్యమును ముందే చదువుకొని. లెస్సఁగా వల్లెవేసి యుండుటచే, నిట్టులొక్కసారి విన్నంతనే యప్పగించినట్లు నటించి నాఁడేమో! లేక, మీరే యాతనిచే ఈనాటక మాడించి నన్నడి కింప నెంచితిరో.

నర : ఓరి మొద్దబ్బాయి! ఎంత పెద్దాలోచనలురా నీవి! ఇది రెండవ సర్గలో ముప్పదవ శ్లోకము. మఱియొక్కటి నీయిచ్చవచ్చినచోటఁ దీసియిమ్ము, చూతువుగాని.

పుల్ల : సరే (భారవి పుస్తకముఁ దీసి కండ్లుమూసికొని యొకచోటఁ దెఱచును) అయ్యా! ఇదే 13 వ సర్గలో 7 వ పద్యము వచ్చినది. దీనిని జదివి యర్థముఁ జెప్పఁడు. చూతునుగాక యీతని జ్ఞాపకశక్తి.

నర : (పుస్తకముం బుచ్చుకొని యిట్లు చదువును)

**శ్లో॥ మునిరస్మి నిరాగసః కుతో మే భయమిత్యేష నభూతయేభిఒమానః**

**పరవృద్ధిషుసిద్ధమత్సరాణాం కిమివహ్యస్తి దురాత్మనామలంఘ్యమ్.**

అస్మి = నేను, మునిః = మునిని, నిరాగసః = దోషరహితుఁడ, మే = నాకు, భయంకుతః = భయమెక్కడిది?, ఇతి = అని చెప్పి, ఏషఅభిమానః = ఈ అహంకారము, నభూతయే = మేలుకొఱకుఁ గానిది, పరవృద్ధిషు = ఇతరుల అభివృద్ధి విషయమై, బద్ధమత్సరాణామ్ = కట్టఁబడిన అసూయగల్గిన, దురాత్మనామ్ = దురాత్ము లకు, అలంఘ్యమ్ = దాటరానిది, కిమ్ ఇవ అస్తి = ఏమున్నది?

తా॥ నేను మునీశ్వరుఁడను. దోషములు లేనివాఁడను. నాకు భయమెందులకు? అని చెప్పెడు గర్వము శ్రేయస్సు గల్గింపనిది. ఇతరుల వృద్ధినిగూర్చి గిట్టియసూయగల దురాత్ములకు అతిక్రమింపఁ దేదియు లేదుగదా?

అనుఁవోతా! నీ భావివర్తనమును సూచించు నీతిని నేర్పు పద్యమిది. పుల్లయ్య నెదకి మంచిదే యిచ్చినాఁడు. ఏదీ, అప్పగింపుము, నాయనా!

అను: (అవలీల అప్పగించును)

నర: ఇప్పుడేమందువు, పుల్లయ్యా? గ్రుడ్డు మీనాకిరింతు వేల? నాయనా నేఁటికిఁక జాలును. లోనికేఁగుము, మీయమ్మ రమ్మన్నదఁట (అనుఁవోతుఁడేఁగును) నారాయణా! చూచితివా యీతని యేకసంథాగ్రాహిత్వము! నీవు నాల్గయిదు సారులు చదివి పద్దె మప్పగింపఁగలవు. ఈ మొద్దబ్బాయి నూరుసారులు చదివినను ఏపద్యమును కంఠస్థము చేయఁ జాలఁడు.

నారా: అనుఁవోతునిది మన సోమేశమునకుండు కుశాగ్రబుద్ధి.

నర: కుశాగ్ర బుద్ధియే కాదు. సద్వినయము, సౌహార్దము, సౌజన్యము సౌశీల్యము-ఇవియెల్ల నతనియం దిమిడి యున్నవి. ఇవి భావికాలమున నాతనికి మహోపకార మొనర్చును. నారాయణా! నీవిఁకఁ బ్రయాణ సన్నాహము గావించుకొనుము.

పుల్ల: అనుఁవోతయ్య రాజైన తర్వాత సన్నుమాత్రము పోషింపఁడా?

నర: పోషింపకేమి? ఎందఱనో అనాథలను బోషించును. వారిలో నీవును నుండవచ్చును. లోనికిఁబొమ్ము.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయ రంగము

రంగము: ఒక చావడి.

ప్రవేశము: పుల్లయ్య, చాకలి పుల్లిగాఁడును.

పుల్ల: పుల్లిగా! గురువుగారు ప్రయాణమునకు సిద్ధపడియున్నారేమో చూచి రా!

పుల్లి: బాబూ! పయన మేడకండి?

పుల్ల: ఎటుంగవఁటరా?

పుల్లి: తెల్దు బాబూ!

పుల్ల: నేను, గురువుగారు, అనుమోతయ్య, కొంత వేఁటసిబ్బందితో నేఁడు వేఁటకై యరణ్యప్రాంతముల కేఁగెదము.

పుల్లి: బాపనయ్యలుగిదా, మీరు వేఁటేంటయ్యా?

పుల్ల: మాలోనందఱును బ్రాహ్మణులుకారే! అనుమోతయ్య అనుప నీత క్షత్రియుఁడు. అతనికి గురువుగారు, ధనుర్వేదము నేర్పినారు. వినోదమునకై వేఁటకుఁగూడఁ దీసికొని పోవుచున్నారు. వారితో నేనుగూడ వెడలి, నాకు శక్తిగలిగినంత సాయము చేయుదును.

పుల్లి: నువ్వేం సాయంసేత్తావయ్యా? దారిలోనిన్ను మేపలేక బాదలు పడాలేమో!

పుల్ల: ఓరి మూర్ఖుఁడా! ఎంతమాటన్నావురా! నన్ను మేపుటకు నేనేమి పశువు ననుకొంటివా?

పుల్లి: పసువుకన్నను ఎక్కువవాఁడవు, బాబూ! మొన్న నువ్వు తిన్నన్ని మామిడిపళ్ళు మానిసి తినగలఁడా? కుడిచి కూర్చుండి గంపెఁడు పళ్ళూ గడియలో కాజేశావే! నువ్వెన్నన్నా, నీది గేదె తిండే బాబూ! మాంజాతోళ్ళు కూడా నీలంత తిండితిని అరిగించు కోలేరు.

పుల్ల: ఓరి, నీకంత యసూయ కేలరా? మంచి తిండికే నీవు పెట్టిపుట్టలేదు. కనుక, తినఁజాలవు. పూర్వజన్మాన నేనితరులకుఁ బెట్టితినిగాన మంచితిండి తినఁగలను.

పుల్లి: బట్టలు గుంజ గుంజి, యెంతో ఆయాసపడతాను. అయినా, నువ్వు తిన్నంత తినలేను బాబు! ఏ పనీ చెయ్యకుండానే అంత తిండి యెలా తినఁగలవయ్యా?

పుల్ల: నేను నీపని, నీగాడిదపనియుఁ జేయుదును. నేనుగూడ నీవలెనే గురువుగారియింట మడికి వలయు బట్టలన్నియు గుంజి యిత్తును. నీ

గాడిదకన్న నెక్కువబరువు మోచికొని పొలము నుండి కూర
గాయలు మున్నగునవి తెత్తును.

పుల్లి: ఇప్పుడా గాడిదపనికే నంటయ్యా, వేటకెడుతున్నావు?

పుల్ల: ఓరీ, బుద్ధిహీనుఁడా? నేనేమి చేయుదునో, నీవే చూతువుగాని, ముందుగా ఆ ప్రక్కగదిలోని కవచాలు కొనిరా. వానిని తొడిగి కొని ప్రయాణమునకు సిద్ధపడుదును.

పుల్లి: (నవ్వుచు) సిత్తం, మారాజా! [లోపలికేఁగును]

పుల్ల: [తనలో] నేను చాకలివానికిఁ గూడ లోకువైతిని. నాకు చదువు రాకపోవుట చేతఁగదా యీలాఘవము!

[చాకలివాఁడు కవచాదులు తెచ్చును]

పుల్లి: తొడగండి బాబూ! ఎంతసక్కగా ఉంటారో సూత్తాం.

పుల్ల: [కాలికిఁజేతివి, చేతికిఁగాలివి దుస్తులు తొడిగికొనుచు చేతఁగాని వంకర తలపాగ ధరించును]

పుల్లి: చాలాబాగుందయ్యా! భారతకతలో ఆ బుహన్నలే తొడి గేడు, ఈయేల నువ్వే తొడిగావయ్యా! ఆయనగాడు సేతకానట్టు సటుసేశాడు. నీకు సేతకాక యిలా తొడిగేవు.

పుల్ల: నిజముగా నాకా బృహన్నలతోఁ బోలిక సరిపోయినది. అతని వలెనే సమ్మోహనాస్త్రము వేసి క్రూరజంతువుల నన్నిటికి ఒక్క సారి చంపెదను. డంబములు కొట్టుటలో రెండవ ఉత్తరుఁడని చెప్పఁ దగ్గఅనుపూతయ్యకు నేనే సంపూర్ణజయము చేకూర్చితిసికొనివత్తును.

(వీధిలో పుల్లిగాని గాడిద ఓండ్రపెట్టుట విని ఉలికి పడును.)

పుల్లి: వెఱ్ఱి బాపనయ్య! నువ్వెంతోడవే! మాగాడిద కూతకే నీసేత నాలు సెడ్డాయిగందా, యింక పుల్లూ సింగాలూ అరిస్తే, నువ్వేలా నాట్యంసేత్తావో, ఎలాపరుగులెడతావో సూడాలనుంది. మాటల్లో, కూడు తినడంలోనూ, ఈరుడవయ్యా!

పుల్ల: నోరు మూయుము. నేనంత చేఁతగాని వాఁడననుకొంటివా? మాబ్రాహ్మణులు గట్టిగాఁదలఁచుకొందురేని, చేయఁజాలని పను లుండునా?

పుల్లి: ఆ మాట నిజమే. గట్టిగా తెల్సుకోడానికి, నీకు మెదడుంటే గదయ్యా? వయసు మీరినా, ఆ మాట నరసన్నగారి పట్ల అను, నే నొప్పుకుంటా.

(ప్రవేశము నరసన్న భట్టు)

నర: ఏమిరా, చాకలీ! మా మొద్దబ్బాయితో వాదించుచున్నావు?

పుల్లి: బాబూ! ఈ పుల్లయ్యగోరు ఏటలో జంతువులన్నిటినీ పోడి సేత్తారంట. అనువోతయ్యకి సాయంసేత్తారంట. అందుకోసం ఎంత బాగా తయారయారో సూడండి, బాబూ!

నర: (పుల్లయ్య కేసి తేఱి చూచి) ఓరి మూర్ఖుఁడా! ఇదేమి కవచ ధారణమురా?

పుల్ల: స్వామీ! నాకెట్లు తెలియఁగలదు? "ఇవి కాలికి ఇవి చేతికి" అని దుస్తులపై లిఖించియుంపఁగ తిరి.

నర: భోజన సామగ్రులలో ఇదికూర, ఇదిపచ్చడి, ఇదిపప్పు అను భేదములు, ఎట్టివ్రాఁతయు లేకుండఁగనే, గ్రహింపఁగల మహామేధావివి. కవచధారణ మెట్లో గ్రహింప లేకపోయితివే! ఈ తెలివి తక్కువ మాటలు కట్టిపెట్టి పయనము కమ్ము.

పుల్ల: ఆ తయారులోనే యున్నాను, స్వామీ!

నర: అనువోతునికిఁగావలసిన దుస్తులన్నియు నుదికి తెచ్చితివా?

పుల్లి: తెచ్చితిని, బాబూ!

నర: మన గారయ్యాదొర దగ్గఱకేఁగి, వేఁట సిబ్బందితో సిద్ధముగా నుండుమనుము. అప్పన్నను బండ్లు కట్టుకొని రమ్మను. నీవు కూడ మాతో రావలెను.

పుల్లి: సిత్తం బాబూ! పుల్లయ్యగారి యేటతెలివి సూడాలని నాకూ మనసుంది. తప్పకుండా వత్తాను. సెలవు దయిసేయండి.

[నిష్క్రమింతురు.]

## తృతీయ రంగము

రంగము : అడవి.

ప్రవేశము : అనువోతుఁడు, నరసన్నభట్టు, వేఁటపరివారము.

అను : తాతగారూ, నాకు నేర్పిన అస్త్రవిద్య లక్ష్యలక్షణ సమన్వితము చేయుటకే గదా నన్నీయరణ్యసీమకుం దోడ్కొని వచ్చితిరి?

నర : అవును, బాబూ! ఆలనాఁడు శ్రీరామచంద్రుఁడు విశ్వామిత్ర ప్రేరితుఁడై కాననప్రదేశమున కేతెంచి తాటకాది రాక్షసుల సంహరించి సాధుజనుల కుపకారము గావించిన విధాన, నీవు కూడ దుష్ట విరోధిసంహార మొనర్చి మహాజనుల కుపకారము చేయవలసియున్నది.

అను : వేఁట సప్త వ్యసనములలో నొకటియని చెప్పితిరి గదా, అది రాజుల కెట్లు ధర్మమగును?

నర :

చ॥ పరులకుఁ గీడు సల్పకయ పచ్చికమేసెడు సాధుజంతులన్
కలుకు శిలీముఖమ్ములను గాసిలఁజేయుట పాపమౌను. భీ
కరముగ హింసఁజేసెడు మృగమ్ములఁ జంప నఘమ్ము గాదు. మీఁ
దరహానిగూర్చు పున్నెమగు; ధర్మమె వేఁట నృపాలకోటికిన్.

అను : ఆర్యా! తమమాటలు కాదనను కాని,

గీ॥ జననమొందిన దొక్క బ్రాహ్మణగృహమ్ము;
తినెడుతిండి కేవల సత్వగుణయుతమ్ము,
మనెడుమన్కి పండితబృందమధ్యసీమ
సాధ్యమగునెట్లు నాకు హింసాక్రమంబు?

నర : బాబూ! నీవు చెప్పినమాటయు నిజమే. అయినను.

గీ॥ హరికిశోరమ్మునకు మదహస్తియూథ
సంహరణకార్య మేరీతి సహజమగునొ
క్షత్రజాతిబాలకునకు సైత మటులె
శత్రునిర్మూలనక్రియ సాజమగును.

నీవొక యనుపనీతక్షత్రియ బాలుఁడవు. మా యింట నుండుటచేఁ బ్రచ్ఛన్నతమున నీ తేజము మాటువడి యున్నది. అది బహిర్గతమగు సమయ మచిరకాలములో వచ్చును.

పుల్ల : అయ్యలారా! చచ్చితిఁ జచ్చితి. ఎవఁడో అడవి మనుష్యుఁడు మనవైపు వచ్చుచున్నాఁడు. ఓయి నాయనో! నేఁటితో నా యాయువు ముగిసినది. అమ్మా! నీకున్న కొడుకొక్కఁడును బలవన్మరణఁ మొందుచున్నాఁడే. (ఏడ్చును)

అను : అన్నా! అంతలోనే యేడుపా? ఏఁడీ, ఆటవికుఁడు?

పుల్ల : అదే చూడు. ఒడలంత వెంట్రుకలే. అదిగో, ఇప్పుడు నాలుగు కాళ్ళ జంతువులాగు నడుచుచున్నాఁడు. ఈసారి, మనలాగే రెండు కాళ్ళపై నిలిచియున్నాఁడు.

నర : ఓరి మొద్దా! అది యెలుగు గొడ్డురా! ఓరీ, పుల్లిగా! కొన్ని యెండాకులు ప్రోగుఁజేసి మంటఁబెట్టుము. ఎలుగున కగ్గిఁజూచిన నడలు. (పుల్లిగాఁడు మంటఁబెట్టును. ఎలుగుబంటి పారిపోవును.)

నర : ఓరీ! ఈ యడవిలో నడుగడుగునకుఁజచ్చుచు మరలఁబుట్టుచు నుందువా? ఇంకను ముందున్నది ముసళ్ళపండుగ. ఏ వ్యాఘ్రమో, సింహమో, మనల నెదుర్కొన వచ్చు. అప్పుడు కుప్పిగంతులు వైతువు కాఁబోలు! నడువుము (పోవుదురు)

(తెరపడును, ఇంకొక తెరలేచును,)

అను : ఆర్యా! దవ్వునకన్పట్టు గ్రామము పేరేమి?

నర : అదియే పెదవీడు, ఈ మైదానముననే తొల్లి నీ జనకునకును పూసపాటి మాధవ వర్మకును రణము ప్రవర్తిల్లినది.

అను : మహాత్మా! ఇదా మీ పెద్దలఁపూతరక్త ప్రవాహముచేఁ దడిసిన పుణ్యభూమి? దీనింగాంచుటచే నాజన్మము ధన్యమైనది.

నర : నిజముగా నీవు ధన్యుఁడవైతివి.

సీ॥ ఈపుణ్యభూమియే నీపితృబాంధవ
రక్తభాగీరథీ ప్లావితమ్ము
ఈపవిత్ర ధరిత్రియే రావువంశమ
హావీర మరణశయ్యాతలమ్ము
ఈపూతధారిణియే రవినిభ పద్మ
నాయక తేజస్స్నాతనమ్ము
ఈనిర్మలావనియే వెల్మశౌర్యర
మాలాస్య నేపథ్యమధ్యసీమ

గీ॥ అట్టి దీపావన క్షేత్రమగుట, బాల!
భవదమల వంశజాత భూవరులకెల్ల
ఇది కురుక్షేత్రమగు, దీని మదినినిలిపి
యాత్ర సేయుట ముఖ్య కార్యమ్ముసుమ్మి

అను: మహానుభావా! తెలిసినది. ఈ పవిత్రోద్దేశముతోనా సన్ని చటికి మృగయావ్యాజమునఁ గొనివచ్చితిరి? ఆహా! కృతార్థుఁడను. పితరులారా!

చ॥ నిరుపమ కీర్తికౌముదివినిర్గతిఁ జేసి, పవిత్రరావు వం
శరజనికెల్లఁ దేజమునొసంగిన శారదచంద్రు వీరలో
వరపథగాములార. పరిపంథి నిరాసనకార్యమూని మీ
పరిభవదుఃఖమున్ దొలఁచువాఁడ భరాస్థలివీడులోపలన్

నర: [తనలో] నేను సంకల్పించినరీతిని పనికి, వీరరసోద్రేకము కలుగు చున్నది. ఇంకను దానిని బురెక్కింతుగాక! [ప్రకాశముగా] నాయనా!

చ॥ చలచలఁగాఁగు నూనియల చట్టుల రావుకులప్రధానులన్
చలమునఁ గూలఁద్రోసి యమసన్నిధి కంపిన చోటిదేసుమీ
కలుష మనస్కులై చెలికుగానుఁగలం జొనిపించివెల్మయో
ధుల నరిరాక్షసుల్ మిగులఁద్రుంచిన ఘోరరణ స్థలంబిదే!

సీ॥ అభిమన్యునట్టులే యందఱొక్కటఁగూడి
సింగమనీనిఁ ద్రుంచినదియిచట
ద్రుపదాత్మజునిభంగి దుష్టతన్ యాచమ
నీనిఁ జిత్రవధ మొందించి రచట

వడముడి చూలినింబలెఁ గపటరణాన
వెన్నమనీనిఁ జంపినది యిచట
తనతేరు సవరించుకొను కర్ణునింబోలె
సర్వసేనాపతిం జదిపిరచట

గీ॥ గజదళంబులు కసిమసంగఁ బడెనిచట
ఘోటకవ్రజములనెల్లఁ గూల్చిరచట
కాల్బలము పెద్దనిద్దుర గాంచెనిచట
వెలమ పౌరుషం బిందెమున్ వెలసి చనియె

ఈ మారణ కృత్యములన్నియు ముగిసిన తర్వాత మాధవవర్మ తృప్తిఁజెంది, మంత్రులతో

ఎన్నఁడు పద్మనాయకకులేందిర భర్తృవిహీనయౌను, నిం
కెన్నఁడు రావువంశనది యింకి యెడారిగ మారిపోవు, నే
నెన్నఁడు కన్నులార నిదురింతు, నిఁకెన్నఁడిఁకెన్నఁడంచు నా
పన్నుఁడనై యుమేశుఁ గొలుపన్ గృతకృత్యుఁడనైతి నేఁటికిన్.

అని పలినాఁడు. తనయిష్టదైవమగు భైరవస్వామికిఁ బూజలు చేయించినాఁడు.

అను: తాతగారు! మీరీ యంశములఁ జెప్పుకొలఁది నారక్తమధికోష్ణతం గాంచుచుండెను. మహాపరాక్రమశాలియగు నా తండ్రి పాటు విన్న, దుఃఖోద్రేకముచే నా కంటికొలుకులనుండి కవోష్ణ బాష్పములు జాలువారుచుండెను. ఓ తండ్రీ !

భీమపరాక్రమాఢ్యుఁడని పేరుగడించిన సత్వశాలి పే
వేమగపాడిఁగోలుపడి, హీనవిరోధి నృపాల బాలికున్
తామసునోర్వలేకనికి, తార్క్ష్యుఁడు కాలము దప్పుటన్ నిజ
క్షేమమువీడి, యొక్కెజల జిహ్మగఘాటికిఁ బాటినట్లగున్.

ఆహా! భగవానుఁడా!

గీ॥ కటకటా! రావుకుల తటాకంబులోని
బిసరుహాముకుళ మొక్కటే విడిచియుంచి
పుల్లపద్మకాండము లెల్లఁ బెల్లగింతె!
దైవమా! కన్నుగుట్టెనే దాని సొగసు?

నర : నాయనా ! నీవు ఖేదమందరాదు. నీ పెద్దల ధైర్యసాహసముల నలవర్చుకొనవలయుఁగాని. వారు పరలోకమునుండి నిన్నాశీర్వదించుచుందురు. వారియాత్మలు శాంతి పొందునట్లు నీవు శత్రునిర్మూల కార్యమునకుఁ బూనవలయు.

అను : తప్పక పూనెద. అరిరక్తములతో నాపితరులకుఁ దర్పణములు విడుతును.

శత్రురాజమకుట స్థగిత దివ్యమణిత
తియె దేవతార్చిత తిలలుగాఁగ
పరిమళతైలలిప్త విరోధినృప శిరో
జనికాయమే దర్భజాలములుగ
అభిషేక శుభసమయావభృత స్నాత
విహితారి శిరములే పిండములుగ
పుచ్ఛమూపతి సమూహోచ్చారితోత్సాహ
వాక్యంబులే మంత్ర వాక్యములుగ

వైరికంఠోద్గత రుధిర ధారలే తి
లోదకమ్ములుగాఁగ విధ్యుక్త ఫణితి
మత్పితృనిలింప శ్రాద్ధకర్మమ్ము సలిపి
తృప్తిఁగావింతుఁ గాంచెద ఋణవిముక్తి

నర : బాబూ ! నీవు సిద్ధసంకల్పుఁడ వయ్యెదవు. ఇంక మనమిచ్చోటు వాసి పోదము. శకట మారోహింపుము.

పుల్ల : ప్రొద్దు క్రుంకివచ్చినది. నాప్రాణము పోయినను సరే, నేనొక్కయడుగైన నెగదలను. నా తిండి మాట యేమి?

నర : ఓరి తిండి పోఁతా ! ఇప్పుడేకదా పాతిక యరటిపండ్ల నవలీలఁ దింటివి? ఇంతలో నాఁకలియైనదిరా? వృకోదరునివలెఁ గన్పట్టుచున్నావే !

అను : అన్నా ! దారిలో నీకుఁగావలసినంత యాహారమిత్తుము. లెమ్ము, బయలుదేఱు.

పుల్ల : సరే, నన్ను లేవఁదీయుము. నా సత్తువ బొత్తిగా సన్నగిల్లినది
(అనుపోతుఁడు లేవఁదీయ నిష్క్రమింతురు)

(తెరలేచును)

రంగము : భువనగిరి కోట.

ప్రవేశము : అనుపోతుఁడు, నరసన్నయు.

అను : తాతగారూ! ఈ కొండకోట యిట్లు శిథిలమై యున్న దేమి?

నర : బాబూ! ఇది పూర్వకాలమున మీదే. ఇప్పుడు మాధవవర్మ వశమై యున్నది. అతఁడీ పవిత్రదుర్గము పాడుపఱచి యుంచినాఁడు. ఇందే నీ తల్లి తప్పఁదక్కుంగల రాణివాసంపు కాంతలెల్ల అగ్ని ప్రవేశ మొనర్చిరి.

> పసుపుం గంధము మేనఁబూసి, నునుఁ గూర్పాసంబులందాల్చి, యిం
> పెసఁగన్ స్వర్ణపు టంబరంబుల మణీ బృందమ్ములం గట్టియున్
> నొసటన్ గుంకుమ బొట్లు దిద్ది, సుమసందోహంబులం బూని సం
> తస మొప్పారఁగఁ బెండ్లివేడుకనఁ గాంతల్ సొచ్చి రాయగ్నిలో.

అను : ఆర్యా! మీనుడులు విన్న కొలఁది నా ఖేద మతిశయించు చున్నది. ఘోరకిరాత సన్నిభుఁడగు తన్మాధవవర్మాభిఖ్యు చేఁగదా మా కులమున కింత చేటువాటిల్లె? నాకుఁదగిన ఆయు వేయున్న, ఆ నీచుని సమిత్రబాంధవముగఁ దెగటార్చి క్రోధాగ్ని చల్లార్చు కొందును.

నర : వత్సా! నీ తలఁపులన్నియు ఫలించును, ఆ దుష్టుఁడు నశించు కాల మాసన్నమైనది. వాఁడీసడుమ నిన్నుఁబరీక్షించుటకఁట చారులఁబంపినాఁడు. వారు నిన్నుఁజూచియు ఆనవాలు పట్టఁజాలక పోయిరఁట. నీవిఁక కంది కుందకుము. మనము సత్వరమ యింటికిఁ బోదము రా.

పుల్ల : గురువుగారూ! మీ రిరువురు నిట్లు చూచిన చోటులే మరలఁ జూచుచుఁ, జెప్పుకొన్న మాటలే మరలఁజెప్పుకొనుచు, నెంతసే పుందురు? నా కడుపులో దహించుకొని పోవుచున్నది. నే నిఁక బ్రదుకను. నన్ను వృథాగాఁజంపి బ్రహ్మహత్యాపాపముఁ గట్టు కొనకుఁడు.

నర : ఓరి మూర్ఖుఁడా! సమయాసమయము లెఱుఁగకుండ మమ్ము త్వొందరపెట్టెదవేలరా? నిరంతరము తిండి గొడవయే? బాబూ! మనమిఁకఁబోదము రమ్ము. ఇచ్చోటు క్రమ్మఱ నీ వలననే సిరుల కాటపట్టగును, నేను యోగదృష్టిని గ్రహించితిని. ప్రాప్తి కాలము సమీపించినది. పద—

(నిష్క్రమింతురు)

## చతుర్థాంకము

## ప్రథమరంగము

రంగము : నరసన్న గారి పొలము

ప్రవేశము : రేచిగాఁడు నేల దున్నుచుఁ బాటపాడును.

రేచి॥ పంటవలఁతీ, మాయమ్మ! మా బాద తీర్పవే!
పేదసాదలెల్ల బ్రతుక - పెద్ద పంట పండఁజేసి
నీ దయాగుణమ్ము చూపు - నిన్నెనమ్మియుందుమమ్మ ॥పం॥
జాలి గుండె గలుగు సామి - నేలి సిరుల నెల్లనిమ్ము
చాల కాల మతఁడు మనును - చక్కనైన పనులుసేయ॥

అను : [ప్రవేశించి] రేచయ్యా! ఆనందముతో పాట పాడుచుంటివే!

రేచి : బాబూ! ఏలాగో లేని సంతోసం తెచ్చుకొని యిలా పాడుకొంటూ ఉంటాను. ఈ పాట కిస్నయ్య బాబుగారు నా కోసం చేసి పెట్టారు. ఇంటికి పోతే అంతా నోగులేకందా! నాపాట మాటకేం గాని, బాబూ! అందరిలాగా నన్ను "రేచిగా" అని పిలవక, 'రేచయ్యా' అనిమన్నిత్తా రేం? గొప్ప పెబువులే!

అను : ఓయీ! మమ్ము నీవు తప్పక మన్నింపవలయునా? నిన్ను మేము మన్నింపరాదా? ఇదెక్కడి న్యాయము? గౌవర మిచ్చికదా గౌరవము పుచ్చుకొన వలయు?

రేచి : బాబూ! ఈ లాంటి ఉద్దేశాలందరికీ ఉండవు. తమలాంటి కాఁగల పెబువుల కొక్కరికే ఉంటాయి. మళ్లా అయ్యగారి రాజ్జెం మీ కొత్తే, మా పెద్ద కులాన్ని పైకెత్తేత్తారన్న మాట.

అను: అట్టి యదృష్టమే నాకుఁ బట్టినయెడ, హేళనమునకు పెద్ద కుల మని పిలువఁబడు మీ కులమును నిజమైన పెద్ద కొలముగా మార్చి వైతును. మీకు విద్యాశాలలు, సంరక్షణశాలలు మున్నగునవి కట్టించి అస్పృశ్యతను పాపెదను.

రేచి: మారాజా! మీ ఉద్దేశాలుండే పెబువులు మరి పదిమంది యీ దేశంలో ఉంటే, మా మాలకొలమేకాదు, తక్కువ కులా లన్నీ పైకి లేత్తాయి. పజకెంతో సుకం ఉంటాది.

అను: ఒక్క నరమాత్రుని మహారాజుగాఁజేసి బహు ప్రజలపై నధి కారమొసంగుటలో భగవంతుని యభిప్రాయ మట్టిదే కదా!

> అరుదగు మాంసమున్, మడుఁగుటన్నము నేయియుఁ బంచదారయున్
> గరము రుచించు భక్ష్యములుఁ గమ్మనితిండ్లు, భుజించుచున్ నిరం
> తర మధుపానలోలురయి తామరతంపరయౌ సుఖంబులన్
> బరఁగుట కీశ్వరుండు నరపాలుర సృష్టి యొనర్పలేదుగా!
>
> కొందఱు మాత్రమే సుతులఁ గూఁతుల లోకము లోని మానవుం
> డొందు ; నృపాలుఁడెల్లప్రజయున్ దనసంతతి గాఁగఁగాంచుఁ దా
> నెందును వారి సౌఖ్యమునకే పనియుం బలుకున్ దలంపులున్
> జెందఁగఁజేయుఁ, గాన స్థిరచిత్తుఁడుగాఁడు మహీశుఁడెన్నఁడున్

రేచి: ఇంత గొప్పాలోసనలు మీకున్నాయి కనకే, మీరు చాలా బాగ్గెంసేసి పుట్టారనీ, అయ్యగారి కన్నా గొప్ప మారాజు లవు తారనీ, లచ్చి మీ యింటే యెప్పుడూ కాఁపురం ఉంటాదనీ, నరసన్నగారు మాతో ఎన్నోసార్లు సెప్పారు. ఆయన మాటలు బమ్మదేవర మాటలే.

(రేచిగాఁడు దున్నుచుండ, ఏదో నాఁగటికి తగిలి ఖణీల్లని మ్రోఁత పెట్టును).

అను: రేచయ్యా! ఆధ్వని యేమి?

రేచి: బాబూ! ఏదో నాఁగలి కొసకి తగిలింది, ఒక యినుప ముండిగ లాగుందండి.

అను: మన్ను పెల్లగించి దానిని తీయుము.

రేచి: (మన్ను తీయును. అది కదలదు)బాబూ! ఇదొక పెద్ద పాత్రలాగుంది. ఊడి పడకుండా ఉందే!

అను: గునపముతో త్రవ్వి చూడుమోయీ!

రేచి: (త్రవ్వి చూచును. అది చలింపదు)సామీ! ఇది కదలడంలేదు. నా ఒడలంతా సెమటలు పోశాయి, సాలా అలసి పోనాను. ఇంటికెల్లి, ఇంత గంజితాగి మల్లీవత్తాను.

**అను:** సరే, పోయిరా. ఈ లోపల ఆ పాకలోని మంచెపై ఇంచుక సేపు పవళించి విశ్రాంతిఁ దీసికొందును, (ఆవులించుచు) కొంచెము నిద్దుర బద్దకముగ నున్నది. (రేచిగాఁడు నాఁగటిని విడిచి పోవును. అను వోతుఁడు మంచె నెక్కును.)

అను: (తనలో)భువనగిరి దుర్గ సమీక్షణము గావించిన నాఁటి నుండియు నా తలఁపులు పలువోకలు పోవుచున్నవి. మది కూరట లేకున్నది. శత్రురక్తముతోఁ దమకుఁ దిలోదకములిచ్చినఁగాని ఆత్మశాంతి గల్గదని అవసాన సమయాన నా తండ్రినుడివెనఁట. అది యెన్నఁటికేని నెఱవేర్పఁగలనా? దానికిఁదగిన ధనము, జనము నాకెట్లు లభించును? ధనమున్న జనమున కేమికొదువ? రెండునుం గలిగినను, పరమేశ్వరానుకూల్యము లభింపవలెనుగదా! పరమేశ్వరా! నీ చెయిదములు విపరీతములు.

జనకుల్ కాంచన సింహపీఠముల రాజ్యశ్రీలతోఁ గ్రాలఁగాఁ
దనయుండీగతి నొక్క బాపనుని కేదారంబులో నుండు ప
త్రవికార్యంబున గడ్డిపంచెపయి నిద్రంబోవ యత్నించెడున్
ఆనుభోగంబునఁ బ్రాణులెవ్వరికి వారై యుంద్రుగా ధాత్రిలో!

దేశకాలములు మారఁగూడదా? తాతగారి జ్యోతిషము నిజము కాఁగూడదా?

దైవమే యనుకూలింపఁ దలఁచునేని
ఘల్లుఘల్లు రనుచు మ్రోయుగజ్జె లొప్పఁ
గాముఁగన్నమ్మ, నలమేనిసామికొమ్మ,
లక్కిమమ్మ మాయింటికి రాకయున్నె?

[మరల నావులించి] ఆ తటాకంబుపై నుండి వచ్చు చల్లని పిల్లగాలులు మేనికిసోఁక వింతహాయి కలిగి తలఁపులన్నియు మఱపునకు వచ్చి నిద్రకూరుచున్నదే! ఇంచుకతడవు నిద్రింతును. [నిద్రించును]

రేచి: [తనలో] ఛీ, ఛీ! మొండి పానాలు పోకుండా ఉన్నాయి. ఓరి దేవుడా! నే నేంజేశానని యిలా బాదలు పెడతావు? కొడుకులూ, కోడళ్ళూ ఉన్నారన్న సంతోసం లేకుండా, ఆళ్ళచేత రోజూ సావ కొట్టిత్తావా? తాగి ఆళ్ళు తండ్రినే తన్నూంటే బుద్ది సెప్పవేమిరా? ఆదెబ్బల్లో ఒక్కటేనా ఆయువుపట్టున తగలగూడదా? నా పానాలు పోగూడదా? అదీ సెయ్యావు. అన్ని దెబ్బలూతిని మళ్లీ ఆళ్ళ దగ్గరకే మెల్లాలని బుద్ధిపుట్టిత్తా వేమిరా? ఓ బగవంతుడా! నాకీ మమకారమైనా పోగొట్టు, నా పానాలైనా తీసెయ్యి—ఏ వూరైనా పారిపోదామంటే, ఈ నరసన్న బాబుగార్ని ఇడవలేకున్నాను. ఈ యసలాంటి మారాజు మరెక్కడా దొరకడు. ఓ పార్వతీదేయీ, ఓ నూకాల్తల్లీ! ఓ నాగేశ్వరుడా! మీరంతా నన్నెందుసేత కాపాడరు? [అన్యోడ నొక త్రాఁచు జలజల ప్రాఁకుచు వాని ప్రక్క సేపోవును] అబ్బ! ఎంత పెద్దపాము! అది తిన్నగా మాపాకలోకే పోతూందే! అన్నట్టు, అక్కడ మా అనువోతయ్య పండుకొన్నాడు. ఆయన్ని కరవదుగద [అని పాకలోనికి పరుగెత్తును]— ఏటీ, యింత! అది పడగ యిప్పి మా అనువోతయ్యకి గొడుగు పడుతూందే! ఇలాంటివి జరిగినట్లు కతల్లో యిన్నాను. మా బాబు తప్పకుండా రాజవుతాడు. లేపితే, అతనిచెయ్యి పాముకు తగిలి కరుత్తాదేమో! [బాగుగా పరికించి] ఇదేమి తమాసా? అదేమీ సెయ్యకుండా పారిపోయిందే! నూకాలుతల్లి దయవలన బాబు బతికాడే!

అను: [నిద్రలోఁ గలవరించుచు] తల్లి!...న...ర...బ—లే?

రేచి: ఇదేమిటి, నరబలంటున్నాడు? ఆ తల్లెవరు?

అను: బలియియ్యని-చో, గోలెము రాదా? [కలవరింపు]

రేచి: తెలిసింది, తెలిసింది, ఇందాక నాగలికి తగిలిన పాతరలో బంగారం ఉందోయేమో! లచ్చి యితని కల్లో కనఁబడి నరబలి అడుగుతూందేమో! [ప్రకాశముగా] బాబుగారూ! లెండి, లెండి.

అను: [ఒడలు విరుచుకొనుచు] రేచయ్యా! తిండిఁదిని వచ్చితివా?

రేచి: ఏం తినడం బాబూ! ఇంతగంజి పీల్చివచ్చేశా. కొడుకులు, కోడళ్ళూ చెడతాగి సావగొట్టారు.

అను: అయ్యో! పాపము నన్నుఁబిలువలేక పోయితివా? వారిని చీవాట్లు పెట్టి యుందును.

రేచి: బాబూ! ఆమాటకేమిగాని, ఇందాక నిలవరించారు, ఏదైనా కలొచ్చిందా?

అను: నిజముగా ఒక కలయేవచ్చినది సుమా!

రేచి: ఏమని ఆకల? బాబూ!

అను: ఒక అందమైన కొలను, అందొక తెల్లని తామరపువ్వు. దాని నడుమ నొక చక్కని చాన కూర్చున్నది. ఆమె కిరువంకల నేనుఁగులు నిలిచి తొండములతో నీ రభిషేక మొనరించుచున్నవి. ఆ యింతి చిఱునవ్వుతో నావంకఁ జూచి "నాయనా! ఇందాఁక రేచిగాని హాలమునకుఁ జగిలిన దొక గోలెము. దాని నిండ బంగారము కలదు. నీ వంశములోనివాఁడగు ఘనుఁడొకఁడు దానిని పాతిపెట్టినాఁడు. దానిహక్కు నీదే. కాని, అది నరబలిలేనిదే రాదు" అని పలికినది. నేనాశ్చర్య పడితిని. ఏదో చెప్పఁ బోయితిని గాని, నీవు లేపితివి. కల కఱిఁగిపోయినది.

రేచి: బాబుగారూ! ఇంకోసారి తవ్వి సూత్తాను. [గాదు కదిలదు] ఇది నిజంగా లచ్చిమి పెభావమే. నరబలివ్వాండి. వచ్చేత్తది— బిందెలో బంగారం ఉన్నమాటే ఇనబడుతూంది.

అను: నరబలియేమి? రేచయ్యా!... ఎవ్వరైనా నవ్వరా?

రేచి: మీరు నిదరోతుండగా, ఒక నాగుపాము వచ్చి, మీతలకి గొడుగు పట్టిందండి. మీరు గొప్పపెబువులై తీరతారు. నరసన్నగారు ఇలాంటి కతలెన్నో సెప్పారు. పానలు వల్దండి.

అను: నీకేమి వెట్టియా? ఈ శకునాలు నమ్మియా భావి నిర్ణయము చేయుట?

రేచి: కొన్ని నమ్మాలండి, పడుసు తనాన్ని మీరు నమ్మకున్నా, ముందు ముందు, పిల్లలు పుట్టింతరవాత అన్నీ నమ్మితీరతారండీ.. నరబలిని గురించి నేనో సలహా యిత్తానండి.

అను: అదేదో చెప్పు.

రేచి: సదువుకోని వోడు, మాలోడు, సెప్పేడని తోసి పుచ్చకండి. నేను సెప్పినట్లు సెయ్యండి,

అను: అదేదో తెలిసినఁగాదూ?

రేచి: ఆలాగ్గైన ఇనండి. నా కేడుగురు కొడుకులని మీకు తెల్సు గందా?

అను: కొంపఁదీసి వారిలో నొకని బలియిత్తు ననెదవా?

రేచి: ఎంత మాటాడేరూ! నా పానాలన్నీ నా పిల్లలమీదే ఉంటాయి గందా! ఆళ్లల్లో ఒకరినైనా పోట్టుకోగలనా? అదిగాదు నా ఉద్దేశం, యినండి, నా కొడుకులూ, కోడళ్లూ సెడతాగి నా యెముక లిరగ గొట్టడం ఎరుగుదురు గందా–

అను: ఎఱుఁగుదును. ఏరిగన?

రేచి: ఆళ్ల బాద నే పడలేకు న్నాను. ఆళ్ల నిడిచి మనలేకుండానూ ఉన్నాను.

అను: కనుక నిన్నే బలిఁగొనుమందువా?

రేచి: అవునండి! అనుమానించకండి

అను: హరి! హరి: ఎంత మాటాడితివి —

రేచి: మీలాంటి ఎన్న మనసు గలోరికి ఇది చెయరాని పనిలాగే కనబడతాది కాని, బాగా ఆలోచించండి. నా బాద తప్పించిన పున్నెమూ, అంత బంగారం ఒక్కసారి ఒళ్లోపడ్డ లాబమూ– రెండూ వత్తాయి. నాను గాకుంటే నరబలికి మీ కింకోరు దొరకరు. నరబలిత్తే గాని, గోలెంరాదు. బాగా ఓజన సెయ్యండి.

అను: బంగారము లభింపకున్న, పోనీ; నిన్ను మాత్రము బలియీయఁజాలను.

రేచి: బాబూ! నా మాట యినండి, నన్ను బలవంతాన్ని అప్పనం సేత్తే అది తప్పు. నా అంత నా నే మిమ్ముల్ని కోరుతూంటే, అందులో తప్పేంటి? ఎనక తీయకండి.

అను: ప్రాణాలమీఁద రోఁతపుట్టి. దానిని త్యజించుట కీవు తెగింపవచ్చును. కాని, నీ మంచితనమెఱిఁగియు, సర్వమానవ సౌభ్రాత్రము వహింప వలయునని తలఁపు గలవాఁడనై యుండియు, ఎట్టి జీవహింసయుఁ జేయరాదని నిర్ణయ బుద్ధి గలవాఁడ నగుటయు, నిన్నే... బాగు... వధింపఁగలను? వధను గూర్చివిన్న, తాతగారేమందురు?

రేచి: తాతగోరి దగ్గిరకెళ్ళి "రేచిగాణ్ణి బలియియ్యనా?" అని అడిగితే, ఆయనగోరొప్పుకోరు" బాపన మారాజు అనవసంగ పానాలు తియ్యడాని కిట్టపడరు. కాని, అంతా జరిగిపోనాక "యిధ లేక రేచిగాణ్ణి బలిచ్చా" ననండి...ఆయ నేమీ అనరు.

అను: తాతగారేమియు అనకపోయినను, నా మనస్సాక్షి నన్నుఁ గుట్టదా? నన్నేగాక, ఆ ధన మనుభవించు నా సంతతి వారి హృదయాలెల్ల విదారింపదా?

రేచి: ఆలాగైతే, ఒక ఉపాయం సెప్తాతా, యినండి. ...మీ దేగోతరం?

అను: నా గోత్రము మాట నీ కెందులకుఁ? మాది వాసిష్ఠసగోత్రము.

రేచి: నన్ను బలిచ్చి, మీ గోతరం పేరు నా పేరు మీదుగా మార్చుకోండి. కులం ఉన్నన్నినాళ్లు నా పేరు తిరంగా, బూమ్మీన నిలుత్తాది. మరోసంగతి - మా మాలకొలానికి మీ రావు వారంతా ఒక మేలు సెయ్యాలి.

అను: అదేమి? రావు వారందఱు చేయుటేమి?

రేచి: మీ యిళ్లల్లో ఏపెళ్లయినా, మా వోళ్లల్లో ఒకరికి ముందుగా కట్టనాలిచ్చి పెళ్లి చేయించండి. ఆళ్ల తలంబ్రాలు మీరు పోసుకోండి. ఈ రెండు సరతులకీ మీ రొప్పుకుని నన్ను బలివ్వండి. మీ దోసమేమీ ఉండదు. ఆ సెరువులో తాన మాడి వత్తాను. కత్తిని నే నూరుకొనివత్తా... బాబ్బాబు ! నాకీ లోకంలో దిన దిన గండం తప్పించాలి.

అను: ఓయీ! నీ సాహసము చాల చిత్రముగా నున్నది. ప్రాణాల మీఁద నెంత విసుగు పుట్టినను, నీవలె బలికి సిద్ధపడువారుండరు. ఆ పాత్ర, బలి యిచ్చినఁగాని — అందునను నర బలియిచ్చినఁగాని, కదలదనుట మఱియు వింతగా నున్నది. సకలప్రాణి సంరక్షణ మొనర్పఁజూచెడు దేవత ఒక్క జనుని భక్షింపఁగోరునా? అజ్ఞానుల వలె నేను గూడ మూఢవిశ్వాసమునకు లోను గావలసిన దే యగునా? ఈ చిరకాల సేవకుఁడ వగునిన్ను అన్యాయముగా తెగటార్పవలెనా?

రేచి: ఈ సందేగాలన్నీ కట్టిపెట్టండి. నా మాటయినండి, నరసన్న గోరు వత్తే, ప నడ్డిపోతాది.

అను: రేచయ్యా! నాకు విత్తము చేకూర్చుటకై, ఊరక ప్రాణము లర్పింతు సందు వేమోయి?

రేచి: ఒక జీవానికి బాద కలిగిత్తే కాని, యింకో జీవనానికి సుకం రాదు. చీమల్ని తిని బల్లులు, బల్లుల్ని తిని పిట్టలు, పిట్టల్ని కొట్టి నరులూ, బతకటం లేదా? అదీగాక, సా వేఁటి, బతు కేఁటి. సావు బతుకులీ బొందికిగాని, లోపలి అత్మకి లేవు గందా ! నా బొంది సాలా బాదల్లో ఉంది? ఆ బాదలు తప్పించండి, బాబూ — అన్నాను గాని, మరోటి కాదే !

అను: నీవుగొప్ప వేదాంతివి, రేచయ్యా. ఇదేమి, నాఒడలు నాకు తెలియకున్నవి ! ఏదో విస్మృతి కలుగుచున్న దే (ఒకవాణిశ్రవణగోచరముకాఁగా) ఆఁ ! ఏమనుచున్నావు? ఆలసింపక వానిం దెగవ్రేయమనుచున్నావా? ఎవరవు నీవు నీ శరీర మెక్కడ?

రేచి: అది ఆకాశవాణండి. మిమ్ము తొందర పెడుతూందండి. నా సామి దేవునికి యిట్టవే! యింక జాగు సేయకండి.

అను: రేచయ్యా! లేలెమ్మని ఎవరో నన్ను పిలుచు చున్నారు. (పడి పోవుచు) నన్ను పట్టుకో, నాతల తిరుగుచున్నది.

రేచ: లెండి బాబూ! లెండి(ఒడలెరుఁగని అనువోతునిలేవఁదీసి, భద్రముగాఁ గొలనిగట్టువంకఁ గొంపోవును (తెరలో)

అను: ఎవరు నీవు? నన్నీగతిఁ దివియుచున్నావేవి? ఇదేమి కత్తి నాచేతి కిత్తువు? ఈ యమలాత్ముని చంపలేను. అయ్యో! నీవే కరముం బట్టితివేమే ? మహామాయాస్వరూపిణీ! వీనిని ఖండించుటకే! వలదు, వలదు. అతిఘోరకార్యము! హా! హా? (తెరపడును)

## చతుర్థాంకము

## ద్వితీయ రంగము

రంగము : చేనిగట్టు;

ప్రవేశము : అనువోతుఁడు, నరసన్నభట్టు

నర: నాయనా! ఆలాగున్నావేమి?

అను:

> భూతమొ, దయ్యమో మఱియపూర్వపుశక్తియొ, యావహించి, నా
> చేతఁగటారియుంచి, మనసేవకు, రేచుశిరమ్ముఁ ద్రుంచి, భూ
> పాతమునొందఁజేసె; బహుపాపముఁ జేసితి, నో గురూత్తమా!
> పూతయశమ్ముమాపి. పరిభూతమొనర్చితి మీ ప్రబోధముల్.
>
> హృదయము భగ్గు భగ్గు మని యేర్చెడు రేచయ వర్తనమ్ము నా
> మదిని దలంప; భూరిధనమండలిఁ గూటిచి మందునిన్ ననున్
> మదిమది మండలేశ్వరుగ మార్పఁ ద్యజించెనతండు ప్రాణమే;
> వదలదు తన్మహాదురిత భారము నన్ను. మనంగ నేర్తునే?

(ఏడ్చును)

నర: బాబూ! ఏమిది? ధనమేమి, రేచిగాఁడు నీకుఁగూర్ప యత్నించు టేమి. ప్రాణము త్యజించుటేమి? ఆ కథయంతయుఁ జెప్పుము.

అను: (గాద్గద్యముతో) తాతగారూ! రేచయ్య నేలదున్నుచుండ నొక గోలెము హాలంపు మొనకుఁ దగిలినది. దానిం దీయ నాతఁడెంత ప్రయాస పడినను అదిరాదయ్యె. అతండింటికేఁగి మరలవత్తునని పోయెను. అంతలో నాకు నిదురపట్టి యొక కలవచ్చినది. అందు లక్ష్మి కనఁబడి నరబలి యడిగినది. ఆ స్వప్నోదంతము రేచయతోఁజెప్ప, నతఁడు తన్నే బలిగా నర్పింపుమని నన్ను బలవంత పెట్టినాఁడు. నేనెంతకును ఒప్పుకొంటిని. అయ్యెడ నొక యద్భుతశక్తి సన్నావహించి, నాచేతఁ గత్తియుంచి, నాని శిరస్సు తెగవ్రేయించి నది. నాకా పిమ్మట నొడలు తెలిసినది. మహాపాతక మొనరించితి.

> నను దండింపుఁడు మీకుఁ దోఁచినక్రియన్; మాతన్ బ్రియస్నేహితా
> శిని దక్కుంగల బంధువర్గముల నేలీలంగనం జాల; మ
> జ్జనక క్రోధముఁ దీర్చువాఁడనని ప్రజ్ఞల్ వల్కితి న్వాఁడు; వా
> నిని దీర్పంగ నశక్తుఁడన్, గురువరా! నిర్వీర్యతన్ సైఁపుమా!

నర: నాయనా! ఇదియంతయు దైవనిర్మాణము. ఇందు నీ తప్పే మున్నది? రేచిగాఁ డారీతిగాఁ జచ్చి శాశ్వత యశంబుఁ గాంచవలె ననియు, జనక హనన క్రోధముఁ దీర్చుకొను నవకాశము నీవు శీఘ్ర ముగాఁ బొందవలెననియు, ఈశ్వరుఁడే ఆదేశించి యుండెను, ఒక యంత్యజుని సాయమున నీ కపారధనమ్ము లభించునని నీ జాతక చక్రము వ్రాసిన నాఁడే మీయమ్మతోఁ జెప్పితి. అదినేఁడు కలిగి నది. వగ పుడుగి ఆనిధిం గైకొందువు గాని, రమ్ము (అనువోతుని హస్త ముంబట్టి గోలెముకడ కేఁగుదురు. బెల్లు లించుక పెల్లగించి నంతనే గోలెము తేలికగా లభించును)

వత్సా! చూచితివా? ఆలక్ష్మి తన చేతులతోనే అందిచ్చిన దేమో యన్నట్టు లీగోలెమెంత సులువుగా లభించెనో, చూడు! (దానిని తెఱచి) ఆహా! ఇదియంతయు స్వర్ణమయము! అన్నియు మేలిమి బంగారు నాణెములు!

> ఇదె పృథ్వ్యాది సమస్త భూతతతి నిస్సీక్షింప, నీ పూర్వికుల్
> ముదమందన్, గనకాభిషేకరచనన్ ముంగోలు పట్టంపు సం
> పదఁజేకూర్చెద; శౌర్యధైర్యముఖసంపచ్ఛ్రేష్ఠులం బెక్కురన్
> గదనక్షోణిఁ జేర్పు మీధనముచేఁ; గల్యాణమౌ, బాలకా!

(కొన్ని నాణెములు తీసి అనువోతునిపైఁ జల్లును)

అను: ధన్యోస్మి! ధన్యోస్మి! (నమస్కరించును)

నర: కుమారా! నీవిఁక రేచిగానికై కుందరాదు. వాఁడు మహా త్యాగరాజు. స్వర్గముం జూఱకొన్నాఁడు.

అను: రేచయ్య నన్ని వరముల కోరినాఁడు— ఒకటి, మా గోత్రము మార్చికొనుట, రెండవది మాయింట నే పెండ్లియైన జరుగుసప్పుడు ముందుగా నొక మాలదంపతులకుఁ బెండ్లిచేసి, వారి యనుమతిని ఆ యుద్వాహము జరుపుట.

నర: ఇటుపైని మీఁది రేచర్ల గోత్రమై, మీవంశజు లెల్లరుఁ బంచమ కులోద్ధరణమ్మునకై పాటుపడెదరు గాక! ఈ ధనలక్ష్మితో మన యింటికిఁబోయి మీ యమ్మను దక్కంగల బంధువులను అలరిం తువుగాక, రమ్ము.

(నిష్క్రమింతురు.)

## పంచ మాంకము

## ప్రథమ రంగము

రంగము: రాజవీధి;

ప్రవేశము: పొట్టి రామన్న, సుబ్బయ్య.

రామ: సుబ్బయ్యా! మా నరసన్న భట్టునకుఁబట్టిన అదృష్టముం గూర్చి వింటివా?

సుబ్బ: నే నీనడుమ యాజ్ఞికమునకు కమలాపురము పోయితిని. ఆ కారణమున నా కేవార్తలును దెలియవు. ఏ మా యదృష్టము?

రామ: నరసన్న పొలములో నొక నిక్షేపము దొరికినదని విన్నావు గదా?

సుబ్బ: ఆ సంగతి విన్నాను. దానిని తన వెలమ మనుమని కే యిచ్చి నాఁడఁట కాదా?

రామ: అవును. ఆ ధనము వెలమ మనుమని పూర్వులు పాతిపెట్టి రఁట. కనుక ఆ పిల్లవానిదే దాని హక్కఁట.

సుబ్బ: అ ధన మెట్లు వినియోగించినాఁడు?

రామ: కొంత సేనను సమకూర్చుకొని, తాతగారితోఁగూడి మాయ వేసముల మాధవవర్మ రాజ్యములోఁ జొచ్చినాఁడు.

సుబ్బ: చొచ్చి యేమిచేసెను?

రామ: మొదట మిత్రభేదముఁగావించి, వర్మ స్నేహితుల నందఱ వశ పఱచు కొనెను. ఆవల రాజ్యమంతయుఁబర్యటనముఁ గావించి యసంఖ్యసేనానీకముఁగూర్చికొని నాఁడు.

సుబ్బ: ఆ సేనతోఁ యుద్ధము చేయఁగలైనా?

రామ: మహా శౌర్యముతో దాడివెడలి మొదట మొగులూరి దుర్గ మును ముట్టడించి మాధవ వర్మ నోడించినాఁడు.

సుబ్బ: ఆ రణరంగమున నరసన్న కూడ నుండెనా?

రామ: ఉండక మానునా? సపుత్ర బాంధవముగఁబోయి తోడు పడి నాఁడు.

సుబ్బ: సహజ భీరుత్వముగల బ్రాహ్మణులు గదా, యెట్టులా రణా వనిని నిలువఁగలిగిరో?

రామ: మా నరసన్న పైకిఁబిఱికి వానివలెఁగన్పట్టును, కానివిలువిద్దెలో ద్రోణునంతటి వాఁడు. కృష్ణసూరి అశ్వత్థామ, కృష్ణయ్య కృపా చార్యుఁడు — అని చెప్పవచ్చును.

సుబ్బ: నాఁడు మనమందఱము గూడి వానిని వెలివేసి నపుడీ సామర్థ్యములం గూర్చి చెప్పవైతివే!

రామ: అప్పుడు మా వెంకన్న జట్టులో చేరవలసి వచ్చెను.

సుబ్బ: ఇప్పుడు మరల 'మా నరసన్న' అని వెనుక వేసికొని వచ్చుచున్నావా?

రామ: అప్పుడు మతముఁగూర్చి పట్టుదలలు వచ్చినవి. జ్ఞాతులము గాన, ఆ పట్టుదలలు నిలుచునా?

సుబ్బ: కాని. మీరప్పుడు పెట్టిన త్రంపి యింతలోఁజల్లాఱునని నేను దలఁపలేదు. అప్పుడు నరసన్న బీదవాఁడు, ఇప్పుడు మహాధన వంతుఁడు. శత్రువులు, మిత్రులు తారుమారు లగుట న్యాయమే.

రామ: ధనమన్న ఆశలేని వారెవ్వరు?

సుబ్బ: సరే, ఇప్పుడు మీ ప్రాణమిత్రులు వెంకన్న, దీక్షితులు మున్నగు వారు తోఁకలు ముడిచి రనుకొందును.

రామ: ముడువ కేమి చేయుదురు? దానికేమిగాని, అనుమోతుని గూర్చిన విశేషము లేఁగనో, యిప్పుడో మా కృష్ణసూరి వలనఁ దెలియఁగలవు (నారాయణ శాస్త్రితో కృష్ణసూరి ప్రవేశించును) అదిగో, మాటలలోనే వచ్చినాఁడు మా కృష్ణ సూరి. కృష్ణా! నీకు నూతేం డ్లాయువు. విజయ వార్తలెల్లఁ జెప్పు మోయీ?

కృష్ణ: మన యనుమోతమహారాజునకుఁ బరిపూర్ణ విజయము కలిగినది.

రామ: అటు గాదు, నిన్ను నుడువుమన్నది. వివరించి చెప్పు -

కృష్ణ: మొదట మొగులూరి దుర్గము మాకు వశమైనది.

రామ: ఆ వార్త విన్నాము.

కృష్ణ: తరువాత, ఇనుకుర్తి కోటను ముట్టడించితిమి. అందే 121 జాతుల చంద్రవంశపు రాజులు గలరు. మహారాజు వారి నెల్లర సంహారించుటంజేసి అతనికి, 'సోమకుల పరశురాముఁడు' అను బిరు దిచ్చి రచ్చటి వారు.

నారా: ఆ బిరుదమిచ్చు సభలోనే కాఁబోలు, మహారాజుచే గురువు గారు 'అయ్యనవోలు' గ్రామమును శ్రోత్రియుల కగ్రహారముగ నిప్పించిరి.

కృష్ణ: అవునప్పుడే — అంత భువనగిరి, ఓరుగల్లు, పానుగల్లు, మెతుకు, గోలకొండ, రాజగిరి మున్నగు చోటులంగల కోట లన్నియు మన

విభుని వశమైనవి. భువనగిరి దుర్గములోఁగల, సేనానాయకులందరు సభచేసి, అనుపోతునకు 'ఆంధ్ర దేశాధీశ్వరుండు' అని బిరుద మిచ్చిరి.

సుబ్బ: మన కండ్ల యెదుటం బుట్టి, యొక పేద బాలుని వలె మన యూరిలోఁదిరుగుచు, నరన్నగారియొద్దఁ గావ్య పాఠములు నేర్చు కొనుచుండు అనుపోతుఁ డెంత వాఁడయ్యెను!

కృష్ణ: ఆంధ్ర దేశము నిక్షత్రియ మొనర్చు తలంపుతో ఆతఁడు సల్పిన సమర క్రీడ వర్ణింపఁదరము కాదు.

నారా: క్షత్రియులకుఁదోడ్పడిన రెడ్లలో నాయకుల నెల్ల మన ప్రభువే స్వయముగాఁజంపియుండెనఁట. మాధవవర్మను గూడ అతఁడే శిరఃఖండన మొనరించి తద్రుధిరములతోఁ దండ్రులకుఁదిలోదకము లిచ్చెనఁట.

కృష్ణ: అంతయు నిజమే. దిగ్విజయయాత్ర ముగిసినది.

రామ: కృష్ణా! నరసన్న బాబయ్య యెక్కడున్నాఁడు?

కృష్ణ: మహారాజుతో రాజగిరి దుర్గ మందున్నారు.

సుబ్బ: అక్కడ నేవేని శుభకార్యములు జరుగునా?

రామ: సుబ్బయ్యా! నీ వృత్తి కనుగుణమగుప్రశ్నయే వైచితివి. ఎక్కడెక్కట శుభకార్యములు జరుగుచుండునో తెలిసికొనుటలో నీకు శ్రద్ధ మిక్కుటము.

కృష్ణ: అట్టి శ్రద్ధ యందఱ కుండఁదగినదే. రాఁగల మాఘమాసమున మహారాజునకు వివాహము ముందుగా జరుగును. పిమ్మట ఉగాది నాఁడు రాచకొండ కోటలో అతనికి పట్టాభిషేకము నిర్ణయించినారు.

సుబ్బ: ఆ మహోత్సవాలకు మమ్ము మఱచి పోకుసుమీ!

కృష్ణ: అంతయు ప్రభునాజ్ఞను బట్టి నడుచును.

సుబ్బ: ప్రభువు మీ చేతిలోని వాఁడే కదా!

రామ: అట్లన వీలు లేదు. 'అడ్డాలలో నున్నప్పుడు బిడ్డలు గాని, గడ్డాలు వచ్చిన తరువాత బిడ్డలా?' — అన్నట్లు ప్రభువు పెద్దవాఁడై యింగితజ్ఞుఁడై యుండఁగా నొరులకు స్వాతంత్ర్యముండునా? కృష్ణా! అనుపోతుని పెండ్లి యంటివే, దానికి ముందు మాలదంపతులకుఁ బెండ్లి సేయుదురా?

కృష్ణ: తప్పక చేయుదురు. రేచిగాని మనుమలలో నొకనికిఁ బెండ్లి నిశ్చయించితిమి. వారి యుపయానములో నుపయోగించిన తలఁ బ్రాలు అనుపోతుని కుపయోగింతుము.

సుబ్బ: మాలవాండ్రు ముట్టుకొన్న వే?

కృష్ణ: అవును. వారు ముట్టినంత మాత్రాన తండులములు పుచ్చి పోవునా? ఖాందసపుటాచారాలు కట్టిపెట్టుఁడింక.

సుబ్బ: మా యాచారము లిప్పుడు మారవు.

కృష్ణ: మూఢాచారాల పట్ల ప్రభువులే జోక్యము కలుగఁజేసికొని మాన్పింప వలయును.

రామ: ఆచారముల మాట కేమిగాని, అనుపోతున కెవరిపిల్ల నిత్తురు? ఆ కథ యంతయుఁజెప్పుము.

కృష్ణ: రాజగిరికి ప్రక్కనుండు పల్లెలో చెలికాని మాధవరావు గారను నొక ఘనుఁడు చిన్న జమీందారుఁడు కాఁపురమున్నాఁడు. అతఁడు తురుష్కులతోఁ బోరిపోరి విసిగియున్నాఁడు. అంత భార్య గతించినది. మాధవరాయనికి వైరాగ్యము కలిగి యుద్ధ క్రీడలు మాని, ఒక పల్లెలో ఒక ఆరామ మేర్పరుచుకొని దాని నడుమ నొక యిల్లు గట్టుకొని, ముని వృత్తితో జీవనము చేయుచున్నాఁడు. అతని కొక్కతెయే కూఁతురు, చక్కని చుక్క, మంచి గొనముల కిక్క. యుద్ధానంతరము మన యనుపోతుఁడు వేఁటకుఁబోవ బుద్ధి పుట్టి, ఆ పల్లియప్రాంతమునకుఁబోయెను. చెలికాండ్రు త్రోవతప్పిరి. అనుపోతుఁడు పిపాసా ప్రేరితుఁడై యా యారామ గృహమునకు పోయినాఁడు. అప్పుడు మాధవరాయఁడింట లేఁడు. సీతమాంబ

యొక్క తెరయే యున్నది. అనువోతుని కామెప్పై మోహమంకురించినది. శకుంతలా దుష్యంతులవలె వారు పరస్పరాను రాగముతో నుండిరి. అనువోతుఁడు మృగయావ్యాజమునఁ బలుమాఱచ్చటికిఁ బోయి మాధవరాయని యనుమతిఁ బొందినాఁడు.

రామ: కృష్ణా! అనువోతునికి మంత్రియెవరు?

కృష్ణ: అతని కెవనియందు విశ్వాసముండునో వాని నతఁడే యెన్నుకొనును.

రామ: ఇంత కష్టపడి పెంచి, పెద్దవానిగఁజేసి, చదువుఁజెప్ప, తన పోలములో దొరకిన సొమ్మంతయు నిచ్చి, నిరుపమాన విజయము కల్గించి, భూరిసామ్రాజ్యము చేకూర్చిన మీ నాన్నగారికిఁదక్కుంగల జ్ఞాతి వర్గమునకును పారితోషికము లిత్తురా, యీయరా?

కృష్ణ: సోదరా! ప్రత్యుపకార మపేక్షించి నాన్నగా రుపకారము చేయుట నీ వెన్నఁడేని చూచితివా? అనువోతునికిఁ బట్టముగట్టి, తాము, మునుపటి వలె శిష్యులకుఁబాఠాలు చెప్పుచు, వ్యవసాయ వృత్తితో జీవనము చేయఁజూచుచున్నారు. నాఁడు చాణక్యుఁడే ఫలమాసించి చంద్రగుప్తుని సింహాసనాధిష్ఠునింగావించెనో, మొన్న మొన్న మాధవవిద్యారణ్యు లేలాభముంగాక్షించి రాయలవారిని విద్యానగర ప్రభువుగా నిలిపిరో, అట్టిప్రయోజనమే నా తండ్రియు అభిలషించును.

సుబ్బ: రామన్నా! నీ శరీరము వనెనే, నీ బుద్ధియుఁబొట్టిగా నున్నదే! నరసన్నకు ధనాపేక్షయే యున్న, నిధిలోని ధనమంతయుఁదానే గ్రహింపఁడా?

రామ: నిజమే. కాని, యనువోతుఁడు మా వింజమూరి వారికి పురోహితత్వమేని ఇయ్యఁడా?

కృష్ణ: అతని పురోహితమును గోరు మన మెల్లరము—అన్ని కుటుంబముల వారమును—అతని పురోహితులమే. ఓరీ! రామన్నా! ఇంక వెంకన్నను మత్సరము మాను మనుము. పట్టాభిషేక మహోత్స

వాలకు రమ్మనుము (కృష్ణసూరి నారాయణశాస్త్రి లోకవంక, రామన్న సుబ్బయ్యగారు లోకవంకను బోవుదురు)

## ద్వితీయరంగము

రంగము : రాజగర కోటలోని ఉద్యానవనము

ప్రవేశము : సోఫాలపైఁ గూర్చుండి, సీతా శీలవతులతో అనువోత మహారాజు.

శీల : శ్రీ నరసన్న భట్టారకుని యవ్యాజ కరుణచే మన కోర్కెలెల్ల సిద్ధించినవి. నే నేయాశయముతో నింతదనుక జీవించియుంటినో, యది నెఱవేఱినది. ఇంక నానందముతోఁ జిరకాల వియోగ సంతప్తులై నాకొఱ కెదురుచూచు మీ నాన్నగారి కడకేఁగెదను.

అను : అమ్మా! అదేఁటిమాట? "మొలక వృక్షంబు గావలయు, శాఖోప శాఖలయి యది ప్రవృద్ధిఁ గాంచవలయు" అని కదా మా నాన్నగారు నిన్నాదేశించిరని నాతో నుడివితివి? ఆయన యాజ్ఞ పూర్తిగాఁ జెల్లింప వలదా? అదిగాక, నేనొక సామాన్య పద్మనాయక కులజుఁడనని మాత్రమే నమ్మి, నాయందు గాటంపు వలపు నిలిపి, నాఁచెట్టఁబట్టిన నీయీకోడలికి నీవన్నిట మార్గదర్శినివై యుండి నీతులు గఱపవలదా?

శీల : మీరిరువురును సీతారాములవలె నన్యోన్య ప్రేమవహించి నూఱేండ్లు మనుఁడు.

అను : అమ్మా! జనకుఁడు నాకముంబట్టి చనినను, కుమారుని విడువక యుండు కౌసల్యవై నీవున్నప్పుడు గదా, మేము సీతారాములమై యుండఁగలుగుట?

శీల : (బుజ్జగించుచు) వెఱ్ఱితండ్రీ! అటులేయుండును లెమ్ము. అమ్మా! సీతా! మా యదృష్టవశమున నీవు కోడలివైతివి. జనకరాజర్షి తుల్యుఁడైన నీ జనకుఁ డన్నినీతులను నీకు బోధించియే యంపియుండును. నేను వేరుగఁ జెప్పను. కుమారా! నీ పట్టాభిషేకమునకు జరుపఁబోవు వినోదాలెవ్వి?

అను : అవియెల్ల తాతగారును, కృష్ణసూరి మామగారు, కృష్ణయ్య బాబుగారును చూతురు. భారమంతయు వారికే విడిచితిని.

శీల : నాయనా! మంచిపని చేసితివి. ఆ మహానుభావులే సర్వసన్నాహముల నేర్పఱింతురు.

(ప్రవేశము - నరసన్నభట్టు)

బాబయ్యగారు కూడ సమయమునకే వచ్చిరి.

అను : ఆర్యా! సన్నాహములన్నియు ముగిసినవా?

నర : విశేష భాగము ముగిసినవి. నవాబులయొద్దఁ జిరకాలము సేవలొనర్చిన రాజకార్యదక్షులం బెక్కండ్ర సంపాదింపఁ గల్గితి. వారేగాక, నీ పూర్వుల కొలువులో వర్తించిన మహిత విశ్వాసపరులఁ గొందఱఁ గాంచితిని. వారలనెల్ల వివిధశాఖల కధికారులుగా నియమించితిమి. విధిలేక మాధవవర్మ కొలువులో నుండియు మన శ్రేయస్సుఁ గోరు ఘనులఁ గొందఱఁ జేరఁదీసితి. ఒక్క ప్రధాన మంత్రిని మాత్రము నియమింప వలసి యున్నది.

అను : ఆపదవికి కృష్ణసూరి మామగారే తగుదురు. కృష్ణయ్య బాబుగారు కార్యదర్శిగా నుందురు. నారాయణ శాస్త్రిగారును సోమేశముబావయు ఆస్థాన కవులుగా నుందురుగాక!

నర : నాయనా! అంతయు సరియేకాని, మంత్రిపదవికి వేరొక్కనిఁ జూచుట మేలేమో యోజింపుము.

అను : యోజించితి. ఆయనయే యుండి తీరవలయును. సహృదయత్వము గలవారు మఱెవ్వరుందురు?

నర : సరే. నీ వివాహకథ, సీతారామ వివాహకథయు, ప్రతి పద్యమునందును వచ్చునట్లు ఒక ఆంధ్రద్వ్యర్థి కావ్యము నారాయణకవి రచించినాఁడు. దానిని నీకే కృతిగా నర్పింపఁదలఁచినాఁడు. మన సోమేశము "యాదవరాఘవీయ" మను ద్వ్యర్థికావ్యమును సంస్కృతమున రచించినాఁడు. అదికూడ నీకు అభిషేక సమయాన అతఁ డర్పించును.

అను: తాతగారూ! నాదొక్క మనవి యున్నది. దానిం దీర్పఁగోరు చున్నాను. ఇప్పుడు మనము సంపాదించిన రాజ్యములో మా తండ్రి గారి రాజ్యము నాకిచ్చి తక్కుంగలయది మీరే స్వీకరించి, దానికి కృష్ణసూరి మామగారి నేలికగా నేలచేయరాదా? ఆరీతి నొనరింపుఁ డని నా ప్రార్థన

నర: నాయనా! నీకోరిక సమంజసమే; కాని.

కవి సూరిజన గాయకవిహంగముల్ మంచి
వసతులొంది సుఖజీవనముగనఁగ,
దారిద్ర్యదుర్భరాతప తాపమున కోడు
పాంథ దీనతతికి స్వాగతమిడ,
అన్యశరణ్యసూన్య లతాలతాంగులు
సాఁచుకేల్దీవల శ్రాంతియడఁప,
ఆశ్రిత భూతచయమునకుఁ బ్రతిఫలా
పేక్షరహిత ఫల బృందమీయ.

రావువంశ కల్పక వృక్షరాజమొండు
బ్రహ్మదేవుఁడే సృజియించెఁ బరమకరుణ;
దానిధర్మంబు సామాన్య దచ్ఛిదళము
దాల్పశక్యంబె? హాస్యాస్పదంబుగాదె?

కావున, బాబూ! మాకు రాజ్యమువలదు. తప్పక నీవే తద్భారము వహింప వలయును.

అను: మీరు రాజ్యభాగము స్వీకరింపకున్న, నే నేమార్గమున, ఋణ విముక్తిఁ గాంచఁగలుదును?

నర: ఆలాగైన, మీ రాజకుంటుబమునకు మేము శాశ్వతముగాఁ బురోహితులమై, ప్రధాన గురుస్థాన మలంకరింతుము, లెమ్ము.

అను: అంత మాత్రమున నాకుఁ దృప్తి తీరదు. మా రాజత్వముతోఁ బాటు, మీ వంశము నుండి యొకని మంత్రిత్వమును శాశ్వతముగా నిలువ నిండు.

నర: నీ చిత్తమునకుఁదోఁచినటులే యగుఁగాక!

అను: కృతార్థుఁడను.

నర: మనకు హితులగు రాజుల నెల్ల నాహ్వానించితిమి. వారి కుచిత ములగు భవనముల విడుదులుగా నేర్పఱచితిమి. కళ్యాణదినములలో నన్ని వర్ణముల వారికి నవిచ్ఛిన్నాన్నదానము జరుగు సన్నాహ ములఁజేసితిమి. నీ పూర్వుల గద్దియ సిద్ధపఱచినాము.

శీల: బాబయ్యగారూ! మా నాయన యథావిధి తన ధర్మములు నెఱపఁగల్గుటకుఁ దగినయుపదేశము లీయవేఁడెదను.

నర: నేను జీవించునంత కాలము మీతోనే యుందుఁగదా? ఎప్పుడే యుపదేశ మగత్యమో, అప్పుడది యొసంగు చుందును. అయినను, సమయమునకు స్ఫురించిన యొకటి రెం డంశములఁజెప్పెద. నాయనా! వినుము.

కనుఁగొను మల్ల నీరజ నికాయ మరంద ధనమ్మునెల్ల మె
ల్లన మధుపాళి యేక్రియ విలాసగతిన్ గ్రహియించునో, చిరం
తన సహకారులై వెలయు తత్కలహంస లొకించుకేని, త
ద్ధనమనుభుక్తిగాంచ కెటు దవ్వగఁబోపునొ, నిస్పృహాత్మలై ।

అల సహకారభూజ మెటు లంచిత సత్ఫల శోభితమ్ముగా
వెలసియు, గర్వసంకలిత వేషముఁదాల్పక, నమ్రభావమున్
దెలిపెడు పైఖరింగనునొ? నిమ్మరి యొక్కఁడురాలురుప్వ ని
శ్చలమతి నుండి యెట్లు ఫలసంఘ మొసంగునొ, గాంచియుంటివే?

కుమారా! యింగితజ్ఞుఁడవగు నీవు వీని భావమెఱిఁగి వర్తింపుము,
సీతాదేవీ! నీకుఁగూడఁ గొన్నిమాటలు చెప్పనలతును. వినుము.

లతిక వీ, వతఁడవలంబదండ మగును,
దదను సరణమె నీ ధర్మమగును.
తమ్మి వీ, వతఁడు తత్సఖుఁడు, సదా వికా
సము వహించుటె నీకు సౌఖ్యమగును.
నీడవీ, వతఁడు నిజ్జెందు దీపంబు, త
దను గమనంబె నీ న్యాయమగును.
అల చకోరమ వీవు, నెల యతం, డెపుడు తత్
ప్రేమ సుధలఁగ్రోలఁబ్రీతి యగును.

వీనిసార మెఱిఁగి సర్వ విధముల నను
కూలవరు ననువోతేంద్రుఁగూడి యిలను
సకల సౌఖ్య సంపద్విశేషములఁగనుము !
శ్రేష్ఠగుణనికురంబ ! శ్రీ సీత మాంబ !

అమ్మా! శీలవతీ! కొమకును, కోడలిని నీవే బ్రోకొనుము. ఐశ్వర్య దారిద్ర్యముల యందు మోదఖేదము లందితివి గాన, నీకుఁ దెలి యని యంశములే యుండవు. నేనిఁకఁబోయెద.

(నిష్క్రమించును)

శీల: కుమారా! ఈ మహాత్ముఁడొసఁగిన యుపదేశముల శ్రద్ధతోఁ బాటింపుమా! నీవు నీ తల్లిదండ్రుల యుచ్ఛస్థితి యందుండ, ఇన్నాళ్లకుఁ గాంచఁగల్గితి. సర్వవిధముల అనుకూలయగు ఇల్లాలు నీకు సమ కూడుట మఱియు ఆనందహేతువైనది. రతీమన్మథులవలె, ఉషా నిరుద్ధులపోల్కి, ప్రభావతీప్రద్యుమ్ను లట్టులు, మీరు రన్యోన్య ప్రేమతో నుందురు గాక! తల్లీ! నీవించుకతడవు నీ హృదయే శునితోఁగూడి ప్రకృతి సౌందర్యమును తిలకించుచు చల్లగాలి నాహరించి రమ్ము

(నిష్క్రమించును)

(సీతానువోతులు సానురాగ దృష్టులఁ బరపికొందురు)

అను:

భామ ! యల జక్కవలజంట నీ మనోహ
రావయవ సుందరత్వమ్ము నందలేక,
లజ్జచే శిరమ్ములు వంచి, ప్రక్కచూపు
లెట్లు నీ వంకఁజూచునో, యెఱిఁగియుంటె?

సీత: (ముసిముసి నవ్వులు నవ్వుచు) ప్రాణేశ్వరా! దాని కేమిగాని,

శైవల మృణాళముఖ పరిష్కారధారి
యగుచుఁబద్మపత్త్రింబె స్వీయాతపత్త్రి
మైవెలయ రాజఠీవిమై నడుగు లిడుచు
నంచతేఁ డరిగెడుఁ; బట్ట మందఁబోలు !

అను : హంసరాజటులుండ, తద్రాజ్ఞియెటులున్నదో చూచితివా?

ఆత్మనాథుండు సభఁదీర్పనరిగియుంట
స్వీయపరిచారికా పరివేష్టిత యయి
యొక్కకమలాసనంబందు నొప్పులొలుక
నంచరాణియె ట్లుపవిష్టయగునొ, కంటె?

సీత :

పద్మపత్ర శయ్యాస్థలిం బవ్వళించి
కపటనిద్ర నటించు నిజపతి నెట్టు
లమ్మరాళ భామిని ప్రబోధమ్మొనర్ప
వెనుకకేఁగునో విఫలయై! కను మహీశ!

అను : నిద్రించువారిని మేల్కొలుపవచ్చుఁగాని, నిద్దుర నటించు వారి నెవ్వరు ప్రబోధింపఁగలరు? ఆనంక జూడుము.

తన్ను వెంబడించి తటిమితటిమి వచ్చు
పోఁతు బాతును గికురించి, లోఁతునీళ్ళ
మునిఁగి వెంటి యేగతి గెంటి చనునొ, కనుము!
కాంత కిష్టంబులేకున్నఁ గార్యమగునె?

సీత : పురుషు లట్టిగౌరవము స్త్రీల కాపాడింతురు. కాని, పురుష కారము చెల్లకుండుట యెన్నఁడేని గలదా?

మందమలయానిలకుమార మాంత్రికుండు
మంతిరించుటఁ గాఁబోలు మైకమంది,
కొమ్మ లవె మిమ్ముఁ గరపల్లవమ్ము లలర
రమ్మని పిలుచుచున్నవి రాకుమార!

అను : అట్లులైనచోఁ గరము కరమునఁ గీలించి మన మొండొరులము విలాసగతి నాకొమ్మల డెందమ్ముల నలరింప నేఁగుదము—పద

[నిష్క్రమింతురు.]

## తృతీయ రంగము

రంగము :- రాజగిరి దుర్గములోని సభాగారము. అది సింహాసనాదులచే నలంకరింపఁబడి యుండును.

ప్రవేశము :- కృష్ణసూరి, కృష్ణయ్య, నారాయణశాస్త్రి, సామంతరాజులు, భటులు మొదలగువారు ఉచితాసనముల నాసీనులై యుందురు.

కృష్ణ : సభ్యులారా ! శ్రీ యనుపోత మహారాజు పట్టభద్రుఁడై సింహాసనాధిష్టుండయ్యెడు శుభముహూర్తమాసన్నమైనది. అవె మంగళ వాద్యంబులు మ్రోఁగుచున్నవి. (బాగుగా పరికించి) అదిగో, మహారాజు సపరివారుఁడై యేతెంచుచున్నవాఁడు. నిశ్శబ్దము! నిశ్శబ్దము !(స్వస్తివాచకులు వేదఘోషవినఁబడును— తెరలో వందిమాగధులిట్లు పల్కుదురు)

"శ్రీ రేచర్ల వంశ విక్రమాదిత్యా ! రేచర్లవార్ధి చంద్రోదయా ! గోన మల్లారెడ్డి రణభూత బలిహరణా ! మంగళపూడి యిమ్మిడి రెడ్డి రణరంగ మర్దనా ! రావువరపు మల్లారెడ్డి భుజాఘట్టనా ! పాలూరి పోలారెడ్డి రణనిర్ధూమధామా ! బండి కోటారెడ్డి రణ భుక్తి ఖడ్గ భేతాళా ! వినుకొండ మరారెడ్డి ప్రాణవాయు హరణ కరవాల క్రూరసర్ప ! కుంట్లూరి మారారెడ్డి కంఠవిదళన ఖడ్గ బైరవ కరవాల దంష్ట్రా ! అరపల్లి గౌరిరెడ్డి బలాటవీదావాగ్ని కీలా ! కొత్తపల్లి కొండారెడ్డి ప్రాణాపహరా ! మహారాజ రాజా ! మార్తాండతేజా ! ఆశ్రితకల్ప భూజా ! శ్రీయనుపోత భూపాల బిడౌజా ! జయము, జయము, దిగ్విజయము !"

(సభ్యులెల్లరు లేచి నిలుతురు. మహారాజు నరసన్నభట్టు కరముం బట్టుకొని సభాగారముం జేరును)

నర : సభ్యులారా ! నేఁడు మిగులఁ బుణ్యదినము.

"అకలంక పద్మనాయక వంశరుచిరము
క్తావళీ తరళంబు రావుకులము
బాహాగ్రజాగ్రత్కృపాణ ధారాహత
ప్రబలవైరిబలంబు రావుకులము
భానుసూనుసమాన దానసంతోషిత
ప్రకటార్థిపటలంబు రావుకులము
విమలకీర్తి ప్రభావిజిత సితాంభోజ
రాజహంస కులంబు రావుకులము
పరమభక్తిప్రపూజిత హరిగిరీశ
రమ్యచరణాబ్జ యుగళంబు రావుకులము
సకలసంశ్రిత పండిత సత్కవీంద్ర
రచిత సుకృతాయత ఫలంబు రావుకులము"

అట్టిరావుకుల వార్ధిచంద్రుం. శ్రీ యనువోతభూతలేంద్రుం, మీయం
దఱిసమక్షమున సింహాసనారూఢుం గావించుచున్నాను.

(కూర్చుండబెట్టి కిరీటమాతని శిరముపై నుంచును. సభ్యులు కరతాళ ధ్వను లొనర్తురు)

కుమారా !

ఆరవిచంద్రతారక మనంత మహీతల మేలు మేలుగా ;
భూరమణా ; భవత్కుల సముద్ర మపారయశఃప్రవాహ వి
స్ఫారితమై, మహీవలయ పాలన భూసురమై, సమస్త వి
ద్యారసశోభితంబగుచు ధారుణిపై విలసిల్లుం గావుతన్

(భట్టు మంత్రాక్షతలు చల్లును, సభ్యులు పుష్పవర్షముం గురియింతురు)
ఇప్పుడు సోమేశ్వరకవి తాను సంస్కృతమున రచించిన "యాదవ రాఘవీయ"మను ద్వ్యర్థి కావ్యములో రెండుశ్లోకములు మాత్రము చదివి గ్రంథము మహారాజేంద్రుల హస్తపద్మములం దుంచును.

సోమే :

శ్లో॥ త్వం రామభూపాలక రాఘవశ్చేత్
త్వం కృష్ణగోపాలక యాదవశ్చేత్
కథం ప్రసిద్ధం బహుకాల ముర్వ్యామ్
నప్రాప్నుయాద్రాఘవ యాదవీయమ్

శ్లో॥ స్వానాంబుధానాం సుహృదాంచ పిత్రోః
గురోః కృపాంప్రాప్య కృతానతిస్సన్
శ్లేషైరశేషై స్సహితం విధాతు
ముపక్రమే రాఘవయాదవీయమ్

కథలో నొక్కశ్లోకము మాత్రము చదివెదను.

శ్లో॥ సాకేతనామా స్సహితార్య సంఘా
నానామహాభూరి వితానశాలా
పురీవరా ద్యౌరివ భాత్యయోధ్యా
భిఖ్యాంత రామా మధురాధరాయామ్

ఇతి వింజమూరి కృష్ణసూరిసూనోః, రామకృష్ణ భక్తస్య, గౌతమస గోత్రస్య, సోమేశస్య కృతౌ రాఘవయాదవీయమ్ శ్రీపదలక్ష్మణే

వృతలక్షణ సూచకే శ్లేషమహాకావ్యే పంచదశాధ్యాయామ్ సర్వాం సంపూర్ణమ్.

(సోమేశము కృతినందించును. రాజునమస్కార పూర్వకముగాఁ గైకొనును. సభ్యులు కరతాళ ధ్వనులొనరింతురు)

నర : శ్రీయనువోత భూతలేంద్రు వివాహకథయు, శ్రీసీతారాముల కళ్యాణ కథయుఁ బ్రతిపద్యమున నిమిడ్చి, నారాయణకవి యొక ద్వ్యర్థి కావ్యమును, నిర్దుష్టాంధ్రమున రచించెను. మన ప్రభూత్తములకె తత్కృతి నంకిత మీయఁ గోరుచున్నాఁడు. అతఁడు రెండు మూడుఁ పద్దెములు మాత్రమే చదివి కృతి నర్పించి ధన్యుఁడగునుగాక !

నారా : అనయంబున్ దనవిష్ణు ధర్మమును జేయంజాల కాత్మాంశముల్
గొని రాజప్రకరంబులన్ బనిచి, శ్రీలోలాక్షితో నిత్య నూ
తన సంతోష వినోదముల్ గనెడు దైత్యధ్వంసి నారాయణుం
డనువోత ప్రభుచంద్రుఁ బ్రోచుత సమస్తైశ్వర్య సంధాతయై.

షష్ట్యంతములలో నొక పద్యము మాత్రమే చదివెద.

సకల విరోధి శిరఃకం
దుక కేళీ విరచిత పరితోషునకున్, బూ
ర్ణకళాంచిత వేషునకున్,
నికర గుణయుతానువోత నృపభూషునకున్

అభ్యుదయ పరంపరగా నాయొనర్పం బూనిన సీతాకల్యాణంబను ద్వ్యర్థి కావ్యమునందలి కథాక్రమం బెట్టిదనిన—
(కృతినందీయఁ బోవును)

ఒకసభ్యుఁడు : కవీంద్రా ! మీ కావ్యమందు రెండర్థములిచ్చు పద్దె మొక్కదానిని గూడఁ జదువఁగోరెదము.

నారా : ఆరీతిగాఁ జదువుట సంప్రదాయ విరుద్ధము. అయినను మీ కోర్కె త్రోసిపుచ్చక చదివెద. గురువులు మన్నింతురుగాక !

జనకుని సమ్మతిన్ సకలసద్గుణ రత్నకదంబ సీతమాం
బ నిఖిలదుర్జన ప్రకరభంజనుఁ దాపసరంజనున్ రణాం
బునిధి విలాస సంచరణ పోతము భూమిపసింహపోతమున్
అనుపమలీలగ్రాల నుపయామవిధిం గయిదమ్మి వట్టెడున్

అనువోతుఁడు కవీంద్రుల కృతులంది, వారికి దుశ్శాలువలు, వేయినూటపదార్లను బంగారు పళ్ళెరముల నిచ్చును. సామంతులు కానుక లర్పింపఁ గైకొనును)

అను: (నమస్కరించి లేచి) గురువర్యా! సభ్యులారా! మీరు నా కొ రించిన సాయమునకుఁ గృతజ్ఞతానతులు. ఇయ్యెడ నేమి పల్క వలయునో యెఱుఁగకుంటిని. నా హృదయము ఖేదమోదపూర్ణ మైయున్నది. నోటమాట రాకున్నది. నా యీ యుచ్ఛ్రాయస్థితికి హేతుభూతులు ఈ మహామహులు శ్రీ నరసన్న భట్టారకులే. నేనుపుట్టి, పెరుగుట, విద్యనేర్చుట, ఇంతవాఁడనై నాపితృదేవ మెప్పుఁగాంచఁ గల్గుట—ఇవియెల్ల ఆ మహానుభావుని మూలము వారి పాదపద్మములకు నాయష్టాంగ నమస్కారము లర్పించి, నే నా నాసంతతియు నిరంతరము వారియెడ కృతజ్ఞులమై, వారి యమూల్యోపదేశములఁ గొనుచునే వర్తింతుమని మీ యందఱి సమక్షమున వాగ్దానము చేయుచున్నాను. [సాగిలపడి నరసన్నకు మ్రొక్కు అతఁడు లేవఁదీయు, లేచి గద్దెలెఁ గూర్చుండును. పూలవర్షము. కురియును తాళ ధ్వనులచే సభాగారము మారుమ్రోఁగును]

నర: సభ్యులారా! సోదరులారా! శ్రీయనువోతమహారాజు నన గూర్చి పల్కిన మాటలకు నేనేమియు మాఱుపలుకఁ జా అతఁడు దీర్ఘాయుష్మంతుఁడై పుత్రపౌత్రాభి వృద్ధిమై మనెడుఁ మని యాశీర్వదించుటకన్న నేఁ జేయునదిలేదు. లోకములో స కార్యసిద్ధికి మూలకారణమా భగవత్కృప. మానవుఁడు కేవల కరణమాత్రుఁడు. కావున అనువోతుని పట్లఁగాని, మఱియెవ్వ పట్లంగాని నేను చేసినదేదియు లేదని, అంతయుఁ బరమేశ కృతమేయనియు మనవి చేయుచున్నాను. మన కింకేమి కావలఁ ఇట్లగుంగాక!

—కవిరాజవిరాజితము—

అవనిని మానవకోటుల కెంతయు స్వస్తియెసంగెడుఁగావుత. భూ
ధవతతి భూపరిపాలనసల్పుత ధర్మపథమ్మును దప్పక యే,
ప్రవిమలజీవన మొందెడు నాలకు బాపలకున్ శుభమౌ సతమున్,
భువనమ్ములన్నియు మేటి శుభమ్ములఁ బొందుతఁ బొల్పెసలారు నటుల్.



